## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050014296

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

**Hosted by: Indian Institute of Science, Bangalore** in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# అంకితము.



ఈగ్రంథము శ్రీయుత మాదిరెడ్డి సీతారామయ్య నాయుడుగారి ధర్మపత్నియు, పరమ సాధ్వీమణియు, కీర్తిశేషురాలునునగు మాదిరెడ్డితాయారమ్మగారి జ్ఞాపకార్థమాయమ కుమారుడు మాదిరెడ్డి గోవిందరావు నాయుడుగారును, కోడలు శ్రీమతి మాదిరెడ్డి ఆండాళ్లు తాయారమ్మగారును శ్రద్ధాపూర్వకముగా నచ్చువేయించినందున నిది పరలోకవాసినియగు నాపవిత్ర చరిత్ర కంకితము చేయబడినది.

జ్ఞానాంబ.

ఓమ్.

# ఉపోద్ఘాతము.

ఈచిన్నిపొత్తమునను ల్లేఖింపబడినకథానాయికయగు మైత్రేయిమునినుగూర్చి కొంచెము చెప్పకుండనుండజాలను. ఆమె యెవరు ? ఆమెయొక ప్రాచీన భారత నారీమణి. ఆధ్యాత్మిక తేజోవిరాజిత. సద్భావరత్నఖని. అఖండబ్రహ్మజ్ఞానసధుని. ఆయమయెట్టిది ? అవక్రపరాక్రమమున రణరంగంబునకురికి శత్రుసేనాసమూహములం జీల్చి చెండాడి రాజ్యంబులు రక్షింప ప్రాణంబులనర్పించిన వీరనారీమణులకుగాని, యనన్య సామాన్యప్రతిభావిశేషము వెల్లివిరియ గ్రంథంబుల రచించి సత్కీర్తినార్జించిన కవయిత్రీ శిరోమణులకుగాని, సర్వసర్వంసహా చక్రంబు నవలీలనేలంజాలునశేష శేముషీధురీణత్వ రాజ్యాంగ రహస్యంబులనెల్ల నెఱింగి, పరిపాలనాపాటవంబు మెఱయ రాష్ట్రంబుల నేలిన రాజ్ఞీమణులకుగాని, సపావి దుర్లభ మైనదో యాపదవిని తరతమ తారతమ్యములతో గూడిన శ్రేష్ఠపదవులనన్నిటిని మించిన యుత్కృష్టబ్రహ్మపదవిని మైత్రేయి పొందగలిగెను. కావున నానావ్యయాధ్యాత్మికతాకు బ్రహ్మదండిగాగల భారతదేశమున భావిసోదరీమణుల

కొలువు యదార్థమగు నాదర్శమును ప్రదర్శించిచిరస్మరణీయ యైనది.

ఆమె యెప్పటిది ? అది వైదిక యుగము. అప్పటి భారతీయులు నాగరికతానగముయొక్క యుచ్ఛశిఖరమునధి రోహించియుండిరి. వారివిజ్ఞానతేజము మధ్యందిన మార్తాండ తేజమువలె పరిసరప్రదేశములకేగాకసుదూర ప్రదేశములకు సైతము వెలుగునీయగలిగియుండెను. వారధిదైవవిషయిక జ్ఞానము ప్రకృతిశక్తులను, అదృష్టదేవతలను, కల్పితకర్తలను మీఱియనాద్యనంతుడు, సనాతనపురుషుడగు పరబ్రహ్మతత్త్వమును గుర్తించి తద్విషయిక విచారమున కగ్రస్థానము నిచ్చియుండెను. బ్రహ్మజ్ఞానపరిమళముచే నాటి భారతీయ వాతావరణము సువాసితమై రాజుల సభారంగములకు, ప్రజల కార్యరంగములకు, నింతేల సంగరరంగములకు సైతమా గుమగుమలను వ్యాపింపజేయుచుండెను. రాజర్షియగు జనకుని యాస్థానమున క్షాత్రతేజమును మిగిలి బ్రాహ్మ్యతేజమే ప్రకాశించెను. పేరెన్నికగాంచిన యాజ్ఞవల్క్యునివంటి బ్రహ్మజ్ఞానులతోడను, సార్థకనామములగు మిత్రునివంటి మంత్రులతోడను, బ్రహ్మనిష్ఠాగరిష్ఠులగు సత్తపోధనులతోడను జనకుని కొలువుకూట మలంకృతమగుచుండెను. నిష్పక్షపాతి యగు జనకరాజు తనసభలో నారీమణులకుకూడ గౌరవస్థాన మిచ్చి నేటి సంకుచితభావ సంక్షుభితచేతస్కులగు స్వామా

దరులకొలకు చక్కనినారము నాయత్తపరచియుంచెను. బ్రహ్మనిష్ఠగల రాజు, ప్రజలు, బ్రహ్మనిష్ఠగల స్త్రీలు, పురుషులు బ్రహ్మవాదులగు భార్యలు, భర్తలునై జనకరాజ్యము జ్ఞానరాజ్యమనదగియుండెను. ఆహా! ఏమి సౌభాగ్యము! అట్టి కాలమున, నట్టిరాజ్యమున నట్టిప్రభువునకు మంత్రియైనట్టి మిత్రునకు పుట్టినట్టి పుట్టిన మైత్రేయి యట్టిది కాక యెట్టిదికానేర్చును? కన్యకగానున్నంత కాలము విద్యాభ్యాసులంగరచుట తోడను, బ్రహ్మతత్త్వవిషయిక శ్రవణముతోడను నామెసమయము వినియోగమయ్యెను. వివాహితయైన పిమ్మట బ్రహ్మజ్ఞానసంపాదనముతోడను, బ్రహ్మధ్యాన తత్పరతతోడను నామెకాలముగడచెను. బ్రతుకంతయు నాధ్యాత్మికతకు నిలయమైవిలసిల్లెను. అతులవిద్యాచతురయయ్యు బ్రహ్మవిద్యనే ప్రధానవిద్యగా మన్నించెను. రూప, లావణ్య, విభవవిభాసితయయ్యు, నైహికసుఖవాంఛలదగుల్కొనక జ్ఞానవృద్ధుడును, బ్రహ్మనిష్ఠ గృహస్థుడును, భోగలాలసతకతీతుడును, నైన యాజ్ఞవల్క్యుని వరించి పెండ్లియాడెను. సంసారభారమును, సర్వాధికారమునుసపత్నియగు కాత్యాయని కేవదలి తానొక సన్యాసినివలెనే జీవితము గడపెను. బ్రహ్మవిదులలో భట్టభద్రుడగు యాజ్ఞవల్క్యుని కోరికోరి వివాహమైనందులకు తనయభీష్టము తీరునట్లతని జ్ఞానబోధాసుధారసపానము చేయుచు నానందించుటయే యామెగృహిణీజీవితకర్తవ్యమైయుండెను.

ధనాగారమునందు గాని తపోగృహమునందే మైత్రేయి భర్తతో నుండగోరెను. ఎంతటి ధీరస్వాంత ! ఎట్టిజ్ఞానపిపాస ! ఏమినిష్ఠ! మైత్రేయిని పరిణయంబైన పిదప కొంతకాలమునకు యాజ్ఞవల్క్యుడు సన్యాసస్వీకారముచేయనెంచి తనయాస్తి నెల్ల రెండుభాగములుగా పంచి కాత్యాయనీదేవి కొకభాగమునుంచి రెండవభాగమును మైత్రేయికీయ నుద్దేశించితినని తెలుపగా మైత్రేయి యావిత్తమువలన నమృతపదవిలభించునాయని ప్రశ్నించెను. ఆచిత్రప్రశ్నయెట్టిదో చూడుడు !

> శ్లో॥ సాహోవాచ మైత్రేయీ । యన్నుమఇయంభగో॥ సర్వాపృథివీవిత్తేన పూర్ణాస్యా । త్కథంతేనామృతాస్యామితి...

హేస్వామిన్ ! ఈసమస్తపృథివీవలయము ధనముతో సంపూర్ణముగా నిండియున్నదనుకొందము. అట్టి దానిని మీరు నాకిచ్చెదరనుకొందము. అపుడాయైశ్వర్యమువలన నా కమృతత్త్వము లభించునా ? మైత్రేయియొక్క ప్రశ్ననువిని యాజ్ఞవల్క్యుడు విత్తమువలన నమృతపదవి లభింపదని తెలుపగా మైత్రేయి

> శ్లో॥ ...యేనాహంనామృతాస్యాంకి మహంతేన కుర్యాం యదేవ భగవాన్వేదతదేవమే బ్రూహీతి.

దేనివలన నేను ముక్తురాలనుగానో యటువంటి ధనముతోనే నేమిచేయుదును ? పూజ్యుడవగు నీవు దేనిని ముక్తిసాధనముగా తెలిసికొంటివో దానినే నాకు చెప్పుమా ! అని వచించి యాజ్ఞవల్క్యుని బ్రహ్మజ్ఞాన సంపత్తిలో పాల్గొనఁ జెంచి యతడీయదలచిన లౌకిక భాగ్యమునంతక తృణీకరించి భర్తకుందగిన సహధర్మచారిణియై వరగెను.

తల్లీ ! మైత్రేయీ ధన్యురాలవు, ధన్యురాలవు. దేహాత్మబుద్ధిం జేసి బద్ధులై బ్రహ్మజ్ఞానదూరులై పరిభ్రమించు విషయాసక్తులు నీయడుగుజాడల ననుసరించి ధన్యులయ్యెదరుగాక. శాంతి ప్రదమగు నీపవిత్రచరిత్రము భారతాంగనలకును, లోకమునందలి సమస్తాంగనలకును వరణీయాదర్శమై వెలయునుగాక.

మైత్రేయియను నీకథను శ్రీసీతానాథతత్త్వభూషణులవారు ఆంగ్లభాషలో రచించిరి. దీనింగూర్చి నేను కొంతకాలము క్రిందట వింటిని. కాని గతవత్సరమువఱకు నాగ్రంథమును చదువలేదు. చదివినతోడనే తెనిగింప బుద్ధి పుట్టినది. భాషా విషయిక ప్రతిబంధములకు జంకక, నాయసమర్థతను విస్మరించి తెనిగింప సాహసించితిని. గ్రంథమాపండిత విరచితము. విషయమా బ్రహ్మతత్త్వ ప్రతిపాదకము. భాషయా బాసుగరాని యాంగ్లము, అనువదించినది. అట్టియెన్నటి

యందును నసమర్థురాలనగు నేను. మఱియొకరివరైన నీయను వాదమునకుఁబూనియుండినచో నెంతేని బాగుండెడిది. ఐనప్పటికి దీనింజదువుటవలన నాయాంధ్ర సోదరీ మణులు కొందరైనను మైత్రేయియొక్క పవిత్రచారిత్రమున ననుకరించి యాధ్యాత్మిక జీవితములగడపఁగల్గెదరేని నేను కృతకృత్యంగా నౌదునని నాతలంపు. ఇంగ్లీషు మాతృకనుండి యీపొత్తమున ననువదించి ప్రకటించుట కనుమతించినందుకు శ్రీ జి. ఏ. నటేశన్ కంపెనీవారికి నేననేకవందనములర్పించుచున్నాను.

జ్ఞానాంబ.



ఓమ్.

# మైత్రేయి ప్రథమప్రకరణము.

---

పాఠకులు నాకథనక్రమము చేసుకొనవలయుననిన తాము మదరాసుమున్నగు నేతావులలో నివసించువారైనను బీహారులో నున్నట్లు భావించుకొనవలయును. మరియు నా మార్గముననే దాదాపు నాల్గువేల సంవత్సరముల కావలి కాలమువఱకు కూడ పోవలయును. ఏమన నేనిపుడు ప్రాచీన గ్రంథములగు ఉపనిషత్తులలో నుదాహరింపబడినట్టియు నుత నిషగ్రిచనకువలయు సాధనముల సమకూర్చినట్టియు పురాతన సంఘటనలు ఘటిల్లిన కాలమునుగూర్చి చెప్పుచున్నాను. పురాతన రాజ్యమైన మిథిలలోని జనకపురముయొక్క పొలిమేరలలో నిలువబడుదము. ఇంకను భావనాపక్షములతో నా పట్టణముచుట్టు నెగురదము. ఇందుమూలమున మనము విశాలప్రదేశమును చూడనేర్తుము. మనచుట్టు నేమిజరుగుచున్నదో బాగుగ తెలిసికొనుటకు సమర్థులమగుదుము. జనకపురము పూర్వకాలమున పాండిత్యమునకు మహాప్రాపకమై యాజ్ఞవల్క్యఋషిసత్తమునకు వేదాంతసంబంధికసహాయానియు, స్మై

పొందుచున్నదై యుండినట్టియు, తరువాతి యితిహాసములలో సీత తండ్రియనియు, రాముని మామయనియు వర్ణింపబడినట్టియు రాజర్షియైన జనకుని నగరమని చదువరులకు జ్ఞాపకముచేయ నక్కరలేదు. నేనీవరకే ప్రస్తావించినరీతిని ప్రాచీన జనక నగరప్రాంతములలో నచ్చటచ్చట దిబ్బలు, మెట్టలు గలిగి కొంతవరకు నిర్జనమైయున్న సమభూమిపై గాలిలో నెగయుదము. వినిర్మలగ్రీష్మప్రాతఃకాలము, ఉదయమై గంటన్నరమాత్రి యయ్యెనది. ఇపుడా సమభూమిగుండ ముగ్గురు బాటసారులు మెల్లగానడచుచు జనకనగరమువైపునకు పోవుచున్నారు. ఈముగ్గురును దీర్ఘకాయులు దృఢగాత్రులు వర్తమాన కాలపు బీహారువాస్తవ్యులనుండి చాలభేదించియున్నారు. వీరిలో నిద్దరాకాలపువైఖరిని నాయుధధారులై యున్నారు. చేతనొకవిల్లు, వీపుననమ్ములపొది, నడుము నవ్రేలుచు నొఱలో నున్న పట్టాకత్తి యిరువురకునునున్నవి. ఒక్కచూపులో వారు క్షత్రియశాఖకు చెందినవారని కనుగొనవచ్చును. సామాన్యమై పరిశుభ్రముగనున్న వస్త్రధారణము గంభీరైకాగ్రతావిశిష్టమగుముఖమండలము; నిర్దుష్టముగానున్న వాగ్ధోరణి వీనినిబట్టి మూడవ వ్యక్తి విద్వాంసుండగు బ్రాహ్మణుండని సులువుగాగుర్తింపవచ్చును. వాస్తవమునకీ బ్రాహ్మణుడు జనకునియమాత్యులందరిలోను మిక్కిలి విశ్వాసపాత్రుడగు మంత్రియును, జ్ఞానియునునగు మిత్రదేశాని కేశవరుడు

కాదు, రాజుగారిచే నొప్పగింపబడిన ముఖ్యరాయభారము నిమిత్తము సమీపపట్టణమునకు కరిగి కార్యానంతరము జనకపురమందలి స్వగృహమునకు మరలివచ్చుచున్నాడు. యోధులాతని రక్షణార్థము వెనువెంటనున్నారు. ఆక్షత్రియుద్వయము యొక్క పదవులనుగూర్చియు, విధులనుగూర్చియు మనకథ నడచినకొలది నెక్కువగా తెలిసికొందుము. ప్రస్తుతమాపథికులు ముగ్గురును దేనిలో మగ్నులైనట్లు కన్పట్టుచున్నారో ఆసంభాషణభాగమును కొంచెమాలకింతము. రాచవారియందొకడు పండితునిఁజేరియిట్లనెను. "పూజ్యుడవగునార్యా నేను వారణాసినుండి తిరిగివచ్చినప్పటినుండియు మీముఖమునందొక విచిత్రవ్యాకులతను గమనించుచున్నాను. ఇప్పుడు సైతము మీమనస్సు చలించుచు, మనసంభాషణము మధ్య శ్రద్ధలేమిని పొందుచుండుట నాకు గోచరించుచునేయున్నది. మాకెఱిగించుటకు మీకభ్యంతరములేదేని మీవ్యాకులతకుంగల కారణము తెలిపిన మేము మీకెంతయు కృతజ్ఞులము కాగలము."

మిత్రుడు:—"యజ్ఞదత్తా! నీకును, విష్ణుమిత్రునకును తెలియనీకుండ దాచవలసిన విషయమెద్దియులేదు. ఆమహాసభ జరిగిన మరునాడే నావ్యాకులతను విష్ణుమిత్రుడు కనిపెట్టి దాని కారణమునారయఁగోరెను. నేనుతరువాత చెప్పెదనంటిని. కాని యింతదనుక నవకాశము కలుగనేలేదు. ఇప్పుడు మీరు

రిద్దరు నొక్కట లభించినారు, నేనిపుడు నెమ్మదిగా చెప్ప గలను. నాహృదయమును విప్పి మీకు చూపుటకు నాకే యభ్యంతరమును లేదు ''

యజ్ఞదత్తుడు:—''మీరు చెప్పిన దే మహాసభను గూర్చి నేను దూరముగా వినియుంటిని. సభను గూర్చి నాకేమియు తెలి యదు. నేను వారణాసికి వెడలునప్పుడొక గొప్పయజ్ఞము కొరకు రాజగృహమున సన్నాహములు జరుగుచుండెను. ఆయజ్ఞ మునకు సంబంధించి సభ సమావేశమైయుండెనా ? మీరు చెప్పు నది దానినిగూర్చియేనా ?

విష్ణుమిత్రుడు:—''నీవప్పుడు లేకపోవుటచేత నొక గొప్ప లాభమును పోగొట్టుకొంటివి. ఆసభకు సమానమైన వేఱొండు సభను నేనెన్నడు చూచియుండలేదు. అట్టి సభ జరిగియుండినట్టు లొకప్పుడును వినియుండలేము.''

యజ్ఞదత్తుడు:—మనపండితవర్యులలో నెవ్వరెవ్వరు సభలోనుపన్యసించిరి''?

విష్ణుమిత్రుడు:—''సుప్రసిద్ధులొక్కరుకూడ ప్రసం గించకుండనుండలేదు. కాని గార్గిదేవి ప్రసంగమును, పండిత యాజ్ఞవల్క్యుడాయమప్రశ్నల కిచ్చిన సమాధానములును మిక్కిలి ప్రశంసార్హములై యున్నవి.''

యజ్ఞదత్తుడు:—"వాదవిషయమేదై యుండెను."

విష్ణుమిత్రుడు:—"ఏవిషయమును ముందుగా స్థిరపరుపబడలేదు. అప్పుడటనున్నవారు యాజ్ఞవల్క్యుని వివిధవిషయములను గురించి నానావిధములప్రశ్నల నడిగిరి. ఆప్రశ్నలెల్ల నానాకాలములందలి వడిగల వ్యాఖ్యానముల్లోవి యుండెను. ఆప్రశ్నలకు త్తరములిచ్చుటలో యాజ్ఞవల్క్యుడు పలువిషయములను గురించి తెలుపవలసినవాడయ్యెను. గార్గీదేవి పరబ్రహ్మముయొక్క సర్వవ్యాపకత్వమును గూర్చి ప్రశ్నించెను. ఉద్దాలకమునిఅంతర్యామియగు పరబ్రహ్మమును గూర్చి ప్రశ్నించెను. నాకుతీరిక గల్గినప్పుడు నే యాప్రశ్నలను గూర్చియు, నాప్రశ్నలకు యాజ్ఞవల్క్యుడొసగిన జవాబుల యొక్క సారాంశమునుగూర్చియు వివరముగా నీకెఱిగింతును. అంతకు ముందుగాని యటుతరువాతగాని నేనెప్పుడును యాజ్ఞవల్క్యుడా సందర్భమున తెలియజేసినంత చక్కని దైవతత్త్వవివరణమును వినియుండలేదు."

యజ్ఞదత్తుడు:—"వారెల్లరు నట్లు యాజ్ఞవల్క్యునిపై కవియుటకు కారణమేమి?"

మిత్రుడు:—యాజ్ఞవల్క్యుడు మొదట కొంచెమవివేకముగా ప్రవర్తించెను. ఆవాదమునకంతకు నదియో

మూలము. ఎటులైనను దానివలన నత్యుత్తమ ఫలితము కలిగినది. స్మరణీయమగు నాసభలోవలె మఱిదే సమయ మునందును యాజ్ఞవల్క్యుని పాండిత్యమును, నాధ్యాత్మికాను భవమును నంత స్వచ్ఛముగా ప్రకాశింపలేదు. అతడింకను యువకుడే. ఆతని వయస్సు ముప్పదియేండ్లు మాత్రమే. ప్రథమ వయస్సునందే బుద్ధియొక్క తేజమిట్టిదై మనుష్య త్వమునందు పూర్ణతగాంచిన పిదప నాతని ప్రతిభ కెంతయు తృష్టసిమి యందుండునోగదా ఇట్టియోగ్యుడగు శిష్యునితో వైశంపాయనఋషి కలహించుటకును శిష్యాధికారములు లేకుండజేయుటకును నెట్లుతలపడెనో చిత్రముగనున్నది''

యజ్ఞదత్తుడు:—''అందువలన యాజ్ఞవల్క్యునకెవ్వి ధమగు కీడు గాని కలుగునని నేననుకొనను మఱియు నది మన కేనష్టమును కాదవింపనేరదు. వైశంపాయనుడు బోధించు వేదమును కృష్ణ యజుర్వేదము నివర్ణించుటయందు యాజ్ఞవ ల్క్యుడు న్యాయమే వచించినాడు. వైశంపాయనుని శిష్యు లందు, గొందఱవలన నే నావేదమును వినియున్నాను. మూల గ్రంథము, వ్యాఖ్యానము, మంత్రభాగము, బ్రాహ్మణము అన్నియు విచిత్రముగా కలసిపోయినవి. దానిని పఠించుట చీకటిగదిలో ప్రవేశించుటను పోలియున్నది. అట్టివేదము కృష్ణమని పిలువబడుట చాల బాగు. యాజ్ఞవల్క్యపండితు

డిపుడు మీసహాయముతో నేర్చి కూర్చుచున్న శుక్లయజుర్వేదము సార్థకనామము కాగలదని నాతలంపు. అయినను దీనిని గూర్చి విశేషముగా మఱియొకప్పు డడుగవలయుననియున్నది. దయచేసి విశ్వామిత్రుడు వచించిన ప్రశ్నాప్రవాహమేల యాజ్ఞవల్క్యునిపై బ్రవహించెనో నాకిపుడెఱిగింపుడు."

మిత్రుడు:—"జనకరాజు బంగారు పత్రములచే మూయబడిన కొమ్ములుగల వేయిగోవులను సభాస్థలి సమీపమున నొక యావరణములో పెట్టియుంచి యటసమావేశమైన వారితో నిట్లనుడివెను. పూజ్యులగు నో బ్రాహ్మణులారా! మీయందఱియందు నుత్తమోత్తమజ్ఞాని యెవడో వారి నీ గోవులందోలుకొని పోనిండు."

యజ్ఞకర్తుడు: - "అద్భుతము !. నేను త్తమోత్తమజ్ఞానినని చాటుకొనునట్టి లజ్జాహీనుడెవడుండును ?"

మిత్రుడు:—"ఆకారణముననే నేను యాజ్ఞవల్క్యుడు మొదట కొంచెమవివేకముగా ప్రవర్తించెనని చెప్పితిని. ఆవులపై నాతనికెంత ప్రేమయో నీవెఱుగుదువు కాదా! అతని యందదియొక బలహీనతగా పరిణమించినది. సభికులెల్లరు మౌనముగనుండుటను ఒక్కరుకూడ గోవులు తమవని

---

* ఈయంశము యజుర్వేదమును రెండుశాఖలుగా (కృష్ణ—శుక్ల) విడదీయుటకు కారణమైన ప్రమేయములకు సంబంధించినదై యున్నది.

యసేకుందున్నను చూచి యాజ్ఞవల్క్యుడు తనశిష్యులలో నొక నిని బిలిచి ఓప్రియబాలకా! ఈగోవులను నాయింటికిం దోలుము'' అని చెప్పెను.

యజ్ఞదత్తుడు:—''ఆహా! ఎంతచిత్రము!''

మిత్రుడు:—''అందఱకు నతని నడత విచిత్రముగ నే తోచెను. పైకి రానీక యడచిపెట్టబడిన కోపపూరితమగు భావ సభయందంతటను ప్రబలసాగెను. చిట్టచివరకు జనకుని హోతయగు అశ్వలుడు తన క్రోధమును వెడలగ్రక్కెను. అతడు యాజ్ఞవల్క్యుని నిట్లులడిగెను. అయ్యా! మీరు మాయందఱిలోను నుత్తమోత్తమజ్ఞానులైనట్లు నిక్కముగా తలంతురా?''

యాజ్ఞవల్క్యుడిట్లనెను. ''ఉత్తమోత్తమజ్ఞానులకు నేనువ్రణమిల్లెదను. కాని నేనీగోవులనురూఢిగా వాంఛించుచున్నాను. మీరడుగు ప్రశ్నలకన్నిటికి నుత్తరములీయగలిగినచో నేనీ గోవులంగ్రహించుటకు బహుశా మీరంగీకరింప వచ్చును. ప్రశ్నింపబడుటకు నేనెంతయు సంతసింతును.'' విష్ణుమిత్రుడు చెప్పిన ప్రశ్నాప్రవాహము ప్రవహించుటకిదియే సంకేతమాయెను. ఆవిషయము నంతయు సవిస్తరముగా నీకు తీరికగనున్నపుడు విష్ణుమిత్రునివలన వినవచ్చును.

యజ్ఞదత్తుడు:—''తప్పకుండ నేనట్లుచేయుదును. కాని

దయయుంచి యివ్వుడు నాముఖ్యప్రశ్నకు జవాబీయవలయును. సభనుగూర్చి యడుగుచు నేను దీనిని మఱచిపోవుచున్నాను. మీవ్యాకులతకు హేతువేమి? మనము నూల్పాడుకొనుచున్న సభకును, మీచింతకును సంబంధమేమి?''

మిత్రుడు:—''నావ్యాకుల కారణము నాకుమార్తెయే. ఆమెకిపుడు పదునెనిమిదేండ్లు ఆమెకు వివాహము కావించుట నాకానందకరమగును. కాని నేనిందు విఫలమనోరధుడ నైతిని''

విష్ణుమిత్రుడు:—''మీయాశాభంగమున కర్ధమేమి కాగలదు? మీకుమార్తెవంటి సౌందర్యవతియు శ్రేష్ఠురాలును నగు కన్యదొరకుట దుర్లభము. అంతియేగాక మనలో నే యువతియును నేర్చియుండని గొప్పవిద్దెలను మీరామె కొసగి యున్నారు. శీఘ్రకాలములోనే మైత్రేయి విదుషీమణియు, వక్తయునై యామె పినతల్లియగు గార్గి యెంత ప్రసిద్ధయో యంత ప్రసిద్ధురాలు కాగలదని నాస్నేహితులతోనే ననేక పర్యాయములనియున్నాను. అట్టి విద్యా సంపన్నురాలికి పాత్ర సంఘటనము కష్టసాధ్యము కాగల్గునా? యువకులగు పండితులు మన నగరము నిండయున్నారు.''

మిత్రుడు:—''పాండిత్యము, సత్ప్రవర్తనముగలయువకులకు కఱవురాలేదు. మైత్రేయి వైవాహిక విషయికమైన

ఆగొప్ప చదరముయొక్క దక్షిణపార్శ్వమున తక్కిన నారీమణులతో కలసి కూర్చుండవలసినదయ్యెను. ఏలనన నాచౌకములో నంతరవలయమునందలి మహావిద్వాంసులగు నతిథులమధ్య గార్గి పీఠమనుర్చబడెను. అయినప్పటికి నాకుమార్తెనుగూర్చి నేను చెప్పనదిది. ఆమెవంటి లేబ్రాయపు కన్యక మేముచర్చించునట్టి విషయములనే మాత్రమైన గ్రహము చేసికొనగలుగునని నేనిదివఱకెఱుగను. కాని యామె యిపుడీ విషయముల గుఱించి చర్చించుటతోడను, యోజించుటతోడను, దినమంతయు గడపుచుంట నే జూచుచున్నాను. ఆమెవివాహమున కియ్యదియే యాటంకము.

విశ్వమిత్రుడు;—"మీపుత్రిక యిపుడు మీరువర్ణించిన మాదిరిగాక యన్యరీతిగా నెటులుండనేర్చును? పదునెనిమిదేండ్ల ప్రాయమున నామె వేదాంతియగుటయందొంత మాత్రము వింతలేదు. నేజెప్పిన భవిష్యత్తు నెఱవేఱుచుంట నేఁజూచుచున్నాను. ఆమె పినతల్లి గార్గివలె బ్రహ్మచారిణిగా నుండగోరునని మీ యుద్దేశమా?"

మిత్రుడు:—"చాలవఱకంతే. 'పిన్నమ్మ గార్గివలె నేను బ్రహ్మచర్యవ్రతమునైన పూనెద, మీరదిసాధ్యమగునట్లు చేయగలరేని యాజ్ఞవల్క్యునినైన వివాహమాడెదననియామెయనును, ఆమహాసభ జరిగిన నాటనుండియు నీయ

భిప్రాయమామెలో దృఢముగ వేరూనినది. నావ్యాకులతకును నాటిసభకును గలసంబంధమిపుడు బోధపడినదిగదా?"

యజ్ఞదత్తుడు:—"గ్రహించితిని. కాని మీకష్టము నాకు సరిగ నర్థమగుటలేదు. మీకుమారిక పాణిగ్రహణము చేయుటకు యాజ్ఞవల్క్యుడు మహానందముతో నంగీకరించునని నాకు తోచుచున్నది."

మైత్రేయి:—"నీవట్లనుకొనుటకు కారణము కేవలము యాజ్ఞవల్క్యుని కుటుంబ జీవనమును గూర్చి యెఱుగకుండుటయే. అతడు వివాహితుడనుమాట మాత్రము నీకు తెలియును. నాకు పూజ్యమిత్రుడగు కాత్యుని కొమార్తనే యాజ్ఞవల్క్యుడు పెండ్లియాడెను. ఈయువతీమణి దాదాపు సర్వవిధముల యాజ్ఞవల్క్యునికి యోగ్యపత్నియైయున్నది. ఆయమ సుందరీలలామ గృహకార్యనిర్వహణమున మిక్కిలి నిపుణురాలు. ఒకమాటుచూచి, మాట్లాడినవారామెనెన్నడును మఱువజాలనంత మృదుమధుర స్వభావముకల సాధ్వి. ఎప్పుడైనను నేను యాజ్ఞవల్క్యునింటికేగినచో నామె లజ్జా వినయ సహితమును, హృదయపూర్వకమును నగు భక్తితో కూడిన సుందరమందహాస విలసితవదనారవిందయై, మనుష్య రూపముననున్న దేవతయని భావింపకుండ నేనుండలేనట్లు చేయునట్టి మధురవాక్కులతో నన్ను మన్ననచేయును,

ఈయుత్తమ భార్యయందు యాజ్ఞవల్క్యునకు గాఢానురాగము కలదు. అది నాకవగతమే. యాజ్ఞవల్క్యుడందుల కంగీకరించినను ద్వితీయపరిణయము ద్వారా యీసాంసారిక సౌఖ్యమునకు హానినాపాదించుటకే నాలోచింపజాల, అదియునుగాక నాబిడ్డ లేతది, యనుభవములేనిది, యామె యెల్లపుడు వివేకముగా ప్రవర్తించునని నేను నిశ్చయింపలేను"

విష్ణుమిత్రుడు:—"మీరు రమారమినంతయు కాత్యాయనీదేవి వర్ణనముతో పరిపుచ్ఛినారు. ఇంను మీయభిప్రాయమేమో దయచేసి తెల్పెదరా ?"

మిత్రుడు—:చిఱునగవుతో "మన యునకపండితునికి కాత్యాయని దాదాపు సర్వవిధముల యోగ్యపత్నియనియనుటలో నామె యితర విషయములన్నిటియందు ప్రవీణురాలైనను వేదాంత విషయములయందామె కభిరుచి లేదని నాతాత్పర్యము. భర్తకు పరిచర్యచేయుట, శిశువులను జాగ్రతగ చూచుకొనుట మున్నగు కార్యముల యందామె సర్వదాతత్పరమైయుండును. నాతనయకును, నామరదలికిని గలపాండిత్యముతజిజ్ఞాస యామెకు లేదు."

యజ్ఞదత్తుడు:—"అటులైన యాజ్ఞవల్క్యుని గృహమునందు మన మైత్రేయికి వలసినంత తావున్నదని నాకు తోచుచున్నది. అతని యానందములో కాత్యాయనీదేవి

పూరింపక విడిచిపెట్టిన భాగము నీవు నింపివేయగలవు."

మిత్రుడు:—"ఆభాగమును నింపుటయో, నింపక దాని వట్టియుంచుటయో, అది యాజ్ఞవల్క్యుని స్వంత వ్యాపారము. అన్యజనులాజోలికిఁబోనేల ?" చివరి వాక్యమునుచ్ఛరించుచునే మిత్రుడాగెను. మఱియు నొకానొక వైపునకు భయాన్వితుడై చూడఁదొడగెను. ఇంతకుముందు చాలసేపటి క్రిందనే యీపథికులు తిప్పలు, మెట్టలుకలిగి కొంతవఱకిఱుకటముగనున్న యరణ్యమార్గములో ప్రవేశించిరి. అటుపై కొన్ని నిమిషములు గడచిన మిత్రుడట్లు మాట్లాడుచుండగనే చుట్టును చక్కని చెట్లతో గూడియున్న యొక తిన్నెపై నొక యేకాంతవాసియాకారమును కనుగొనెను. అది ధ్యానసమాధిని మగ్నమైయున్న పురుషాకృతియనియు గమనింపగల్గెను. ఆపురుషవ్యక్తిని గుర్తింపగల్గుటకై ప్రయత్నించుచుండెను. ఇపుడా దిబ్బమీది వ్యక్తి యాజ్ఞవల్క్యుడేనని గుర్తించి తత్క్షణమె యాఋషివిపత్తులోనున్నాడని తెలిసికొనుటయే మిత్రుని గమనము నడ్డగించెను. మిక్కిలి పెద్దదైన వ్యాఘ్రమొకటి యాజ్ఞవల్క్యుని నోరచూపులతోఁజూచుచు నిశ్శబ్దముగా నడచి మెల్లమెల్లన నాతని సమీపించుచుండెను. ఆఋషి యింద్రియముల బాహ్యప్రపంచము నుండి మరలించి నిశ్చలుడైయుండెను. శుభయంకరుడగు

---

బృహదారణ్యకోపనిషత్తు II, 4, IV, 4.

దుండగీని గుఱించి యతం డేమియు నెఱుగడు. వెంటనే మిత్రుడా యాపదను క్షత్రియుల కగపఱచగా నొక్కక్షణములో వారిరువురును చేతియొక బాణమును తీసి పులివైపునకు గుఱిపెట్టి వేసిరి. ఆశరద్వయమా వ్యాఘ్రముయొక్క నేత్రద్వయములో గుచ్చుకొనిపోయి యాజంతువును కదలలేని దానిని జేసివైచెను. వారు తిరిగి ప్రయోగించి మఱిరెండు బాణముల నాశార్దూల వక్షమున నాటిరి. మఱుక్షణముననే వారు సాగి నేలంబడియున్న మృగము కడకేతెంచి దానిని ఖడ్గములతో రెండుగా నఱికిరి. మరణకాలమునందా జంతువు పెట్టిన పెడబొబ్బచే ఋషికి ధ్యానభంగమైనందున నతడు కనులు తెఱచి చూచెను. ఒకదృష్టిపాతములో నటజరిగిన సమస్త వ్యవహారమును గ్రహించి యాజ్ఞవల్క్యుడత్యంత కృతజ్ఞతమై వృద్ధఋషియగు మిత్రుని పాదములనంటి, క్షత్రియవీరుల నాలింగనము చేసుకొనెను. వారుచేసినట్టి యాశ్చర్యకరమగు రక్షణకొరకు పదేపదే వారికి వందనము లర్పించెను. పరాక్రమ విశిష్టమును, బలీయమును నగు యోధరక్షణమున్నను యాచోట జాగుచేయుట చాల హానికరమని వారటనుండి మిత్రగతిని నగరము వైపునకు నడచిరి. అట్లుపోవుచు నొక్కరొక్కరు వరుసగా తమ తమ గృహముల సమీపమునకు రాగనే వీడ్కొని చనిరి.

———:o:———

# ద్వితీయ ప్రకరణము.

---

ప్రథమప్రకరణములో చివరభాగమున నుల్లేఖింపబడిన సంఘటనము మిత్రుని వాంఛా పూర్తికి సూటిగ తోడ్పడదయ్యె మిత్రుడు నీచస్వభావము కలవాడై యుండినచో యాజ్ఞవల్క్యుని ప్రాణము కాపాడినందుకు బహుమానముగా తన కల్లుడు కావలయునని తీర్మానించెడివాడే. ఆదినములలో దేశమునందు సాంఘికస్థితి యిట్లుండెను. అటువంటి యనుకూల స్థితిగతులయందు సౌందర్యవతియు, విద్యావిశారదయు నగు వధువును వివాహితుడై యున్న పురుషునికి సైతము సమర్పించుట యక్రమముగ పరిగణింపబడెడిది కాదు. మఱియు నేపురుషునకు వధువునర్పింపబడెనో యాపురుషుడా దానమును స్వీకరించి సంప్రీతుడగుచుండెను. అది సామాన్య ప్రజల సంగతి. కాని మొదటి ప్రకరణమున చదివిన దానిని బట్టి మిత్రుడును, యాజ్ఞవల్క్యుడును నసాధారణపు రుషులని పాఠకులు గ్రహింపవలసియున్నది. కనుక యాజ్ఞవల్క్యునితో మైత్రేయి వివాహము సులభసాధ్యము కాకపోయెను. అయినప్పటికి పెద్దపులికథకు ఫలితముగా నీయిద్దరు మహాపురుషులమధ్య స్నేహబంధము దృఢతరమైయించెను. మఱియు

వ్యాఖ్యాత్రివ్యవహార కారణమున నీయిరువురి కుటుంబములలోని స్త్రీలొకరి నొకరు సందర్శించు కొనుటయు తటస్థించెను. ఇందుమూలమున కాత్యాయని మైత్రేయుల కాంతరికస్నేహ భావముదయించి వృద్ధిబలసాగెను. నాకథను బాగుగా తెలిసి కొనుటకుగాను పాఠకులీ నారీమణులనుగూర్చి యిదివఱకు తెలిసికొనిన దానికంటె నెక్కువగా తెలిసికొనవలసియున్నది. వారిరువురును దాదాపు సమవయస్కులు. కాత్యాయని మైత్రేయికంటె రెండు, మూడు సంవత్సరములు పెద్ద. కాని వారి ప్రకృతులు మాత్రము సాధారణముగ ప్రతి విషయ మునను పరస్పర వ్యతిరేకములు. ఈవ్యతిరేక స్వభావమే వారికొకరి యందొకరికి గాఢానురాగము కల్గుటకు మూల కారణమై నిలచినది. వారిరువురు నొకరి యందు లేనిదాని నొకరియందు చూచి యొకరిచే నొకరాకర్షింపబడిరి. కాత్యా యని హృదయము ప్రేమపూరితము. ప్రేమింపదగిన వస్తువు కనుబడుట యొకటియే కావలయును. ఆమె హృదయమున ప్రేమరసము పొంగి పొరలును. ఆమె మిక్కుటమైన భావో ద్రేకము కలదై యుండెను. ప్రేమాస్పదమగు వస్తువు లభింప గనే యామె మోము నవ్వులవెలుగులో తేజరిల్లెడిది. విచార కరమగు విషయమును చూచినను, వినినను తత్క్షణమే యామె నేత్రములశ్రుపూర్ణములయ్యెడివి. ఆయమ మనరబోలె మాదిరి చంచలకనకైనదియు, గాంభీర్యము లేనిదియునై

యుండెను. కథలు వినుటలోడను, వినోదవ్యవహారము
లోడను నామె ఘంటల కొలది కాలముగడుపగలిగియుండెను.
కాని తన భర్తగారు విచారించెడు గభీరవిషయములనుగూర్చి
కొంచెము నేపైనను శ్రద్ధచూపజాలకుండెను. అయినను
నామె దృఢమగు కర్తవ్యనిష్ఠయు, గాఢమగు పతిభక్తియు,
తన యిద్దరు శిశువులయెడను కోమలమగు ప్రేమయు కలదై
యుండెను. ఆమె దినమంతయు భర్తకు సౌఖ్యములొడ
గూర్చుటయందును, శిశువులను సంరక్షించుటయందును గడ
పుచుండెను. క్రమమునకు, పారిశుధ్ధ్యమునకు నామె గృహ
మాదర్శ గృహమైయుండెను. మైత్రేయి ప్రవర్తనమన్ననో
యిపుడు వర్ణింపబడిన వర్తనమున కనేక విషయములలో
సంపూర్ణవ్యతిరేకముగనుండెను. ఆమె నిక్కముగా ప్రేమింప
శక్తి గలదై యుండెను, కాని యామె ప్రేమకు పాత్రులైనవారే
కొందరో యేర్పుకొనబడినవారై యుండిరి. ఆమె నేత్ర
ములు, శ్రోత్రములు, లోపలికి మరల్చబడియుండుటచే బాహ్య
జగమునందలి దృశ్యములును, శబ్దములును మనోహరములైన
వికాని, వికృతములైనవి కాని యామె హృదయమును సులభ
ముగా కదలింపజాలెడివి కావు, ఈదునకు మించిన గాంభీర్య
మును, నేకాగ్రతను నామె ముఖము ప్రదర్శించుచుండెను.
సామాన్యముగ స్త్రీలకానందదాయకములగు వినోదములు,

సంభాషణలు, కథలు నామెకసహ్యములై యుండలేదు. కాని వానిచేత నామె దీర్ఘకాల మాకర్షింప బడెడిది కాదు. అగాధవిషయములను ముఖ్యముగా తత్త్వవిచార సంబాధమైన విషయములను చదువుచు, మననముచేయుచు చాల సమయము నామె గడపుచుండెను. తన తండ్రియింట గృహకార్యములందు తానెంతవరకు పాల్గొను టవసరమనుకొనినదంతవరకు పనులు చేయుచుండెడిది. కాని యదార్థమునకట్టి పనులయందామె కిష్టములేకుండెను. అయినప్పటికిని నేనీవఱకే తెల్పినట్లు వ్యతిరేక స్వభావములుకల యీ యిరువురు నామెఖలమధ్యను గాఢమైన మైత్రి వర్ధిల్లసాగెను. ముఖ్యముగా కాత్యాయనికి మైత్రేయిపై ననుకొనగగిన రీతిగనే వెత్త్రిప్రేమ కలిగినది. మైత్రేయిని సంగర్శించుటామె యానందములలో నొకటియైపోయెను. మైత్రేయిని విడిచిపెట్టుట మిక్కిలి పెద్దబాధగా పరిణమించినది. ఒకనాడు మైత్రేయీ కాత్యాయనులమధ్య నీక్రిందిరీతిగా సంభాషణము జరిగినది.

కాత్యాయని:—"నీకు పెండ్లియైనచో నా సంగతి యేమగునాయని నేను తఱచుగా విచారించుచుందును. నా యిద్దరు చెల్లెండ్రపెండ్లి నాకొక పరీక్షయై పరగినది. కాని వారిని విడిచియుండు టిప్పుడిప్పుడే భరింపదగిన స్థితికివచ్చినది. నీకు దూరమగుటమాత్రము నాకు ప్రాణహాని నాపాదింప

వచ్చును"

మైత్రేయి;—"నన్ను విడువవలసివచ్చునని నీవెన్నఁడు ననుకొనవద్దు. మనమెప్పటికిని వేఱుకాము!

కాత్యాయని;—"నీ భావమేమి? నాయింటికి దాపుగ నుండు వారితో నీవివాహము గనుకకాఁగు సేని మనము తరచుగా కలిసికొనుచుండగలము. కాని నీగృహము నాకు సమీపమున నుండునని నేనెట్లు లాశింపనేర్తును?"

మైత్రేయి:—"నేనసలు పెండ్లిచేసుకొనదనని నీకెట్లు తెలియును?"

కాత్యాయని;—"నిజా? నీవు పెండ్లిలేకుండ నుండెదవా? ఈ యభిప్రాయమే విచిత్రాభిప్రాయము. నీ కరగ్రహణమున గనేకులు ప్రయత్నించెదరు"

మైత్రేయి;—"వారియందొకరికిని నేను ప్రోత్సాహముఁ గలిగింపకున్న నేమగును?"

కాత్యాయని:—"ఎందుకు? నీవు బ్రహ్మచారిణిగా నుండనభిలషింతువా? నేనీ యభ్యాసమును మెచ్చను. నాకీ జాతికి గృహాస్థజీవనమే యుక్తమైనది."

మైత్రేయి;—"స్త్రీలకేకాదు పురుషులకు సైతము గృహాస్థజీవనమే యుక్తమైనది. కాని 'గృహస్థాశ్రమము స్త్రీ కర్హమైనది' అనుటలో నారెంటికి 'గృహస్థాశ్రమము

వినా వేరు కర్తవ్యములు లేవని జనుల యభిప్రాయమైనట్లు దోచెడిని.

కాత్యాయని;—ఇంక నేమికర్తవ్యములను స్త్రీ కల్గి యుండగల్గును? మతధర్మములా? అవి గృహస్థధర్మమునం దే యిమిడియున్నవి. హోమాదులకు సహాయపడుట, దేవత లనుస్తుతించుట, వ్రతోపవాసాదులు సల్పుట వివాహితయైన ప్రతి స్త్రీకిని కర్తవ్యములై యున్నవి.''

మైత్రేయి;—'' ఇంతకుమించిన కర్తవ్యములేవి? లేవని నీవు తెలంపగలవా? ఆత్మజ్ఞాన సంపాదనమొక ముఖ్యకర్త వ్యము కాదా?''

కాత్యాయని;—'' ఔను. అది పండితులయొక్క కర్తవ్యము కాని యెంతమంది స్త్రీలు పండితలై యున్నారు? కేవలము మీ పినతల్లిగారివంటి నారీమణులు మాత్రమే యన్వేషణమును, ఆత్మజ్ఞానోపార్జనకు చాలినంత శ్రమచేయ గల సమర్థతను, సమయమును కల్గియున్నారు. అది ముఖ్య ముగ పురుషుల కర్తవ్యమైయున్నది.''

మైత్రేయి;—'' ఆత్మ పురుషులయందే యున్నదా? స్త్రీలయందుకూడ లేదా?''

కాత్యాయని:—(నవ్వుచు) "నిశ్చయముగా స్త్రీల యందును నాత్మకలదు. అట్లుకాకున్న మనమెట్లు చూడ కలము? వినగలము? గ్రహింపగలము?"

మైత్రేయి;—ఆయాత్మ స్త్రీపురుషులలో సమానముగ నున్నదా? లేక పురుషులలో స్త్రీలకంటె నెక్కువగ నున్నదా?"

కాత్యాయని:—(మరల నవ్వుచు) "ఇరువురిలోను సమానముగనే యున్నది. ఈవిషయమున స్త్రీపురుష తారతమ్యములేదు."

మైత్రేయి;—"ఆత్మజ్ఞానములేక మోక్షప్రాప్తి లేదు కదా? యాజ్ఞవల్క్యుని పత్నినావలన నీసంగతిని నేర్చుకొన వలసిన యవసరము లేదుగదా?"

కాత్యాయని;—"లేదు. నేనీ సంగతినిగూర్చికూడ విచారించియుంటిని."

మైత్రేయి;—"అగుచో పురుషులకుగాని స్త్రీలకు గాని పొందదగినది మోక్షమనుమాటయును సత్యమేగదా?"

కాత్యాయని;—"ఔను దీనింగూర్చి సందేహమేమి యు లేదు."

మైత్రేయి;—"అట్టిదైన మోక్షమునుగూర్చి స్త్రీలకింత విస్మరింపేమిటికి! జ్ఞానాన్వేషణము పురుషులయొక్క ప్రత్యేక కర్తవ్యమని స్త్రీలేల తలంపవలయును! స్త్రీలు తప్పకుండ గృహకృత్యములయెడ శ్రద్ధ వహింపవలసినదే. పురుషులు లౌకికకర్మల నాచరింపుచున్నను మోక్షము గమ్యస్థానమనుమాట మఱువకుందురు. స్త్రీలో తమగృహకృత్యములనుముగించి తాము చేయవలసినదంతయు పూర్తియైనదని తలంతురు ఇంతకంటెను ఆత్మవిస్మృతి పెరిగిపోగలదుగదా!

కాత్యాయని:—"ప్రియమైనదానా? నీవుచెప్పినది కేవలము సత్యము. నీమాటలు నాకన్నులను విప్పుచున్నట్లున్నవి. స్త్రీ పురుష తారతమ్యము కొంతవఱకు లౌకికకార్యములను విభజించుటయందే వినియోగపడునుగాని ఆత్మవిషయమున భేదవాదము నాపాదింపదు అఖండాత్మయే యన్నిటిలోనున్నదని నేను వినియుంటిని. కావున నాత్మజ్ఞానార్జనకై, మోక్షపదవికై శ్రమపడుట స్త్రీకిని, పురుషునికిని యిరువురికిని సమానకర్తవ్యము. నీయుక్తియుక్తత్వమును నాకు విశదపఱచినవి. చాలకాలము క్రిందటనే నాపెనిమిటి నాకిది యంతయు బోధించియుండెను. కాని నేనపుడాయన చెప్పినది గ్రహింపలేదు. గొప్పవిషయములనుగూర్చిన జ్ఞానమును సంపాదించుకొనకపోవుట స్త్రీలయొక్క స్వయంకృతాపరాధ

మని నేనిపుడు కనుగొంటిని. ఈసందర్భమున నేను విశేష ముగా నిందాస్పదురాలనై యున్నాను. ఏమన నాకుగల యువ కాశములు ఘనతైనవి. ఐనను నేనేమియు చేయుటలేదు.''

మైత్రేయి:—''నీ వెంతేని యదృష్టవంతురాలవు అనేక పుణ్యజన్మలయందార్జించిన సుకృతవిశేషముచేత నీకట్టి భర్తలభించినాడు. నారీసంఘము ముఖ్యముగా స్వయంవర, వివాహమున కధికారముకలిగియున్న గొప్ప సెగలలోని నారీ జనము ధనికులును, అమోద ప్రమోదా సక్తులునగు యువకులనే తిమజీవితభాగస్వాములనుగా నెన్నుకొనుటఁజూడ నాకద్భుతముగనుండును. నీనాధునింబోలిన విద్వాంసులు, చింతాశీలురు, ఋషితుల్యులు, మోక్షమార్గములో సహాయ పడజాలినవారునగు పురుషవర్యులనువారేల వెదకికొన కూడదు.'' వారిసంభాషణ మీస్థితికివచ్చుసరికి కాత్యాయనీ దేవి సేవకుడు పల్లకితో ప్రవేశించి స్త్రీలయెదుటికిరా నమజ్ఞ పొంది కాత్యాయనితో నిట్లుచెప్పెను. ''అమ్మగారూ.! తమ బిడ్డలును, దాదియును తమరు చాలసేపు గృహమునకు దూర ఉన్నారని తలంచుచున్నారు. వెంటనే తిరిగి రాగోరు చున్నారు. దాదావు పగలంతయుగడచినది. మీపల్లకీ సిద్ధ ముగనున్నది. ఏమియాజ్ఞాపించెదరు?''

ఈమాటలు వినుచునే కాత్యాయనితేచెను. అత్యా

త్మిక విషయములనుగూర్చి సంభాషించుటయందంత దీర్ఘకాలము నామెగడవుటకిదియే మొదటిసారి. ఇపుడు బిడ్డలను గూర్చిన వివరణమును గృహమునందు తనజాగ్రతను, తన నిర్ణీతినికోరెడు వివిధకార్యములను గూర్చిన తలంపును నామె నుకలంతపెట్టగా మిత్రుని గృహమునందలి స్నేహితులకడ త్వరత్వరగా శలవుగైకొని భృత్యరక్షణములో కాత్యాయని శీఘ్రముగా స్వగృహముఁ జేరెను.

ఇంటిపనులలో మునిగియున్నను, మైత్రేయితో జరిగిన ముఖ్యమైన సంభాషణనుగూర్చి యామె తలంచుకొనకుండ నుండలేదయ్యె. ఆసంభాషణయందలి ధ్యానపూర్ణమగు భాగము మాత్రము క్రమక్రమముగా మఱవునఁబడి మబ్బుక్రమ్మి నట్లుండెను. కాత్యాయనీదేవి మనస్సు మాటిమాటికిని మైత్రేయి యు తమజాతి స్త్రీలవరాన్వేషణము సాధారణముగ మంచిదిగ లేదని నిందించుటయు, తనభర్తను హృదయపూర్వకముగా ప్రశంసించుటయు జ్ఞాపకమునకు తేసాగెను. మైత్రేయి వివాహమాడనొల్లమికిని, మిత్రపరివారమునందలి స్త్రీలు వివాహమునందు మైత్రేయికిఁగల విరక్తినిగూర్చి చెప్పినదానికిని, వరాన్వేషణాది విషయములను గుఱించి మైత్రేయిచెప్పినదానికిని యామెముడిపెట్టెను. ఇదంతయు నామె కిట్లాలోచింపఁజేసెను. నాభర్తకు కాను భార్యయగుట

సంభాషించుటయు, కనిపెట్టుచు నేయుండెను. అయిద్దరును యాజ్ఞవల్క్యుని ప్రాణములంగా భావించిన స్త్రీయులేకాని మతి తెవరునుగారు. ఒకనాడు విష్ణుమిత్రునితో గదిలో చాల సేపుండుటనుచూచియు కొన్నిగుఱుతులవలన జరిగిన సంభాషణ మైత్రేయికి సంబంధించినదని యూహించియు వారి సంభాషణముయొక్క తాత్పర్యమునుగూర్చి యామె యాజ్ఞవల్క్యునడిగెను. అటుపై భార్యాభర్తలమధ్య పెద్దసంవాదమునడచినది. అందులో కొంతభాగము మనమువినెదము.

యాజ్ఞవల్క్యుడు:—"ఎంతవింత! ఇందునుగూర్చి నీ కభ్యంతరములేదా!"

కాత్యాయని:—"అభ్యంతరమునకు నాకు చాలదూరము. నేను తెల్లముగా తెల్పుచున్నాను వినుడు. అట్లు జరిగినచో నేనెంతయో సంతసింతును. మీరందుకొప్పుకొనక పోయినచో నాకు దుఃఖము సైత మొదవును."

యాజ్ఞవల్క్యుడు:— "నీకామెపై నసూయ కలుగదా!"

కాత్యాయని:—"మీకు నాపైనున్న యగాధప్రేమ విషయమున నాకుశంకకల్గిననైన నాకసూయ కలుగవచ్చును. ప్రస్తుతస్థితినిబట్టి నాకసూయలేదు."

యాజ్ఞవల్క్యుడు:—"కాలక్రమమున నీకంటె హెచ్చుగానే నామెను ప్రేమింపకుండనుందునని నీకెట్లు తెలియును?"

కాత్యాయని:—"ఆమెనుగూర్చి మీకుఁగల చిత్తవృత్తులను గుఱించి మీరు నాకు తేటగా తెలియపఱచినారు."

యాజ్ఞవల్క్యుడు:—"అవిక్రమముగ మాఱిపోవచ్చును. అవిప్రగాఢములుగా పరిణమింపవచ్చును."

కాత్యాయని:—"అపరివర్తనమునకు నేనుసంసిద్ధనై యున్నాను. ఆమార్పుకలిగిన యెడల నాకన్యాయముచేయబడినదని నేను నొచ్చుకొనను, ఆమెనాకంటె నెక్కువగా ప్రేమింపబడనర్హురాలు. మఱియు వారిని, వీరిని ప్రేమించుట యనగ వారికొఱకు, వీరికొఱకుగాక యందఱిలోనున్నట్టి యాసంపూర్ణునికొఱకని మీరు చాలమారులు చెప్పియున్నారు. దుర్గ్రాహ్యములగు నీగూఢవిషయములను నేనర్థముచేసికొనలేనని మీకు తెలియును. కానియిటీవలనాలో కలిగినపోరాటములు మీ భార్యనైన నేనుక్షుద్రములగు స్వార్థపరతను చెందిన చిత్తవృత్తులను జయింపవలయునను నిశ్చయమును కలుగజేసినవి. ఐనను నీవిషయమున నామనస్సులోనున్న వాస్తవభావమేమనగా రెండవభార్యను పెండ్లియాడినను మీరామెను నాకంటె హెచ్చుగా ప్రేమింపలేరనియే."

యాజ్ఞవల్క్యుడు:—(మందహాసముతో) నీవు ప్రేమింపబడుటనుగూర్చి నీకున్నవిశ్వాసము మితిలేనిదై యున్నది. నా చేతనగునప్పటికిని నేనివిశ్వాసమును చలింపఁజేయను."

చిట్టచివరి నిర్ధారణము చేయబడులోపల ఏమాదిరి సంభాషణములు భార్యాభర్తలనడుమ నెన్నిజరిగినవి. * సంవాదములలో యాజ్ఞవల్క్యుడు ద్వితీయకళత్రమునుకొనఁగోరుటకంటెను కాత్యాయనీదేవి సవతిని సంపాదించుటకెక్కువకోరికతోనుండినట్లు తెలియబడును. ఆమెయొక విచిత్ర స్త్రీయైయుండును, నేనామెను తప్పక నిందింపవలసి యున్నది. నాల్గువేలసంవత్సరములు నాపై ప్రసరింపజేసిన వెలుతురులో రెండవభార్యాపరిగ్రహముచేసినందుకు యాజ్ఞవల్క్యునినే సంతకంటె నెక్కుడుగ నిందింపవలసియున్నది. కాని మనమాయనయెట్లుండెనో, యెట్లుతలచెనో యాసందర్భములను గమనింపవలయును. అదియే నేజేసినప్రయత్నము.

* బృహదారణ్యకోపనిషత్తు II, 4, IV, 4.

# తృతీయ ప్రకరణము

---

తృతీయ, చతుర్థ ప్రకరణములు రెండింటిలో నంతటను గొలదిగ చర్చింపబడు తత్త్వవిచారణ సంబంధములగు విచారణలకు పాఠకులు సిద్ధపడియుండవలయును. ఎవరికి వేదాంతచర్చయందిష్టముండదో వారీరెండు ప్రకరణములను వదలిపెట్టి యుత్తరకథగొలుకు తరువాతి ప్రకరణములను చదువవచ్చును. కాని యీ శుష్క ప్రకరణములలో మధ్య మధ్య యాజ్ఞవల్క్యుని యొక్క భార్యల స్వభావములను తెలుపునట్టి ప్రస్తావములు కలవు అయ్యవి తత్త్వ విచారమని వఁగిట్టనివారికి సైతము సంతోషము నొదవింపగలవు. మైత్రేయి వివాహానంతరమించుమించొక పక్షముదినములు గడచినపిమ్మట నొకసాయంకాలమున యాజ్ఞవల్క్యుడు తన యింట నొకగదిలో భార్యలిరువురితోడం గూర్చుండి యుండెను. ఆగదినాయన తపోగృహమని పిలుచువాడు. ఈపేరును బట్టి యాగదులకెందుకు నిర్ణీతమైయుండినదో యూహించుకొనవచ్చును. సాయంకాల బలిసమర్పణమప్పుడే సమాప్తమైనది. దైవపీఠమునుండి లేచిన ధూమముతోడను, ధూపమువాసనతోడను గృహమింకను నిండియేయుండెను. ఐనను తపోగృహము మంచి వాయుప్రసారముకల యిల్లగుటచేత

పొగ వెంట నేపోయి గమ్యస్థానమగు గగనమును చేరెను. అగది యందున్నవారు మువ్వురును పొగవదలిపోవుటకై యాతురత తో నిరీక్షించుచున్నట్లుండిరి. దేవతలకు చెల్లింపవలసిన దానిని చెల్లించుటకు వారిష్టము లేనివారుకారు. యాజ్ఞవల్క్య మునికి దేవతలనుగూర్చి కఠినభావములున్నప్పటికిని * వారు సమయము తప్పకుండ సక్రమముగా బలిసమర్పణముచేయు చుండిరి. కాని వారట్టి కర్మకలాపములతో తృప్తినొందియుండ లేదు. దేవతలను (వైదికదేవతలను అనగా ప్రకృతిశక్తులగు పర్జన్యాదులను) తృప్తిపఱచినపిదప బలులు దేనినికాకపో యట్టియాత్మవైపునకు దృష్టిసారించిరి. చూచుటకును, కాకు టకును, వలనుపడని యావస్తువులోనే తమతృప్తినివారన్వే షించినారు. సంభాషణమును మైత్రేయియే యుపక్రమించి నది.

మైత్రేయి:—"అవిషయమును నేడు తప్పకుండ విచా రింపవలయును."

కాత్యాయని:—"ఏవిషయము ! తప్పకయని నొక్కి వక్కాణించుటలో నీయుద్దేశమేమి!"

యాజ్ఞవల్క్యుడు:— "ఆత్మయొక్క యేకత్వమును గుఱించిన వివరణమును మైత్రేయికోరుచు. ఆవిషయమును చర్చింపుమని యామె పెండ్లియైనప్పటినుండియు నడుగుచున్నది.

* బృహదారణ్యకోపనిషత్తు I-4-10

కాని యేదేనొక కారణాంతరముచేత నట్లుజరుగలేదు. తప్పక యదినొక్కి చెప్పుటకది యే హేతువు.''

కాత్యాయని:—''ఆత్మయనగా నేమియను ప్రశ్నను ముందుగా నేలచర్చింపరాదు ? ఆత్మయొక్క యేకత్వమును గూర్చి పిదప చర్చింపనగును.''

మైత్రేయి:—''ఈవిషయమున ప్రశ్నింపవలసిన యవసరము నాకు లేదు.''

కాత్యాయని:—''కాని నాకవసరము. ఆత్మయననే మో చెప్పుము ?''

యాజ్ఞవల్క్యుడు:—''నీప్రశ్నకు నీస్వంతసమాధానము చెప్పుటకేల యత్నింపకూడదు.''

కాత్యాయని:—ఆత్మయనగా ప్రాణముకలదియని నా యభిప్రాయము.''

యాజ్ఞవల్క్యుడు:—''ప్రాణమనగనేమి ? దానికృత్యము లెట్టివి ? అనగా ప్రాణముకలవారమైనందుకు మనమేమిచేయుదుము ?''

కాత్యాయని:—''ప్రాణముకలవారమైనందున మన ముచ్ఛ్వాసనిశ్వాసములు చేయుచున్నాము.''

యాజ్ఞవల్క్యుఁడు:—“తినుట, త్రాగుట, జీర్ణముచేసి కొనుట మున్నగునవికూడ ప్రాణధర్మములే.”

కాత్యాయని:—“అట్లైన నాత్మయనగానూపిరిఁచునది, తినునది, త్రాగునది, జీర్ణముచేసికొనునది యిట్టివేలుగు నితరకార్యములు చేయునదియని తెలిసది.”

యాజ్ఞవల్క్యుఁడు:—“కాని యిట్లూహింపుము. నీవు ఆత్మయని దేనిని భావించుచున్నావో దానికి సుఖము, దుఃఖము తెలియదనుకొనుము. అట్టిదానిని నీవాత్మయని పిలుతువా?

కాత్యాయని:—“అట్టిదాని ప్రాణియని మాత్రము నేనెంతును. అది యాత్మకాదు.”

యాజ్ఞవల్క్యుఁడు:—“అటులేని యాత్మను గూర్చి నీవు తెల్పిన వివరణము సరియైనదికాదని నీవు గ్రహింతువు.”

కాత్యాయని:—“ఎఱుకలేనిదాని నాత్మయని నేను పిలువజాలను.”

యాజ్ఞవల్క్యుఁడు:—“ఎఱుకయనగ నేమి?”

కాత్యాయని:—“ఎఱుకయనగా తెలిసికొనుట.”

యాజ్ఞవల్క్యుడు:—" తెలిసికొనుట కుదాహరణము నిమ్ము."

కాత్యాయని:—" నేను మిమ్ములను, మైత్రేయిని చూచుట, మీరు చెప్పునదివినుట యిందుకుదాహరణము."

యాజ్ఞవల్క్యుడు:—" నీవిపుడేమి చూచుచున్నావో యద్దాని నెల్లపుడును చూతువా? ఇపుడు వినుచున్నదాని నెల్లపుడును వినెదవా?"

కాత్యాయని:—" లేదు. నాకన్నులను మూసికొనినను, నేనిటనుండి దూరముగపోయినను మిమ్ములను చూడజాలను. మీరు మాటలాడకూరకుండినను, నేను నాచెవులను మూసికొనినను వినజాలను."

యాజ్ఞవల్క్యుడు:—" కాని యపుడు సైతము నీవు తెలిసికొనుచునే యుందువు."

కాత్యాయని:—" ఔను"

యాజ్ఞవల్క్యుడు:—" పంచేంద్రియములకార్యము లాకట్టుపడినపుడుగూడ తెలిసికొనుట జరుగుచునే యుండును గదా!"

కాత్యాయని:—"ఔను. అట్లే జరుగుచుండును."

యాజ్ఞవల్క్యుడు:—"మన మెప్పుడేమి తెలిసికొందు ము? తెలిసికొనుటకు ఎవరు? లేక ఏది? విషయమగును."

కాత్యాయని:—"అపుడు మనలను మనమే తెలిసి కొందుము."

యాజ్ఞవల్క్యుడు:—"తెలిసికొనుట యనగా మన లను తెలిసికొనుటయే యని తేలినది."

కాత్యాయని:—"మనలను తెలిసికొనుటమాత్రమే కాదు. ఇంద్రియ సంబంధములగు వానిని తెలిసికొను టయే."

యాజ్ఞవల్క్యుడు;—"ఇంద్రియ సంబంధములగు నవి తెలియబడనప్పుడుకూడ తెలిసికొనుట జరుగుచునేయుం డునని నీవు చెప్పినావుగదా!"

కాత్యాయని:—"ఔను. నేనట్లుచెప్పినాను."

యాజ్ఞవల్క్యుడు:—"మనలను మనము తెలిసికొను టయనది తెలిసికొనుట కావశ్యకమైనది. అదిలేకుండ తెలి సికొనుటనునది యుండనేరదు."

కాత్యాయని:—"నేను దీనిని సరిగగ్రహింపలేదు. తెలిసికొనుటనునది కొన్నివేళల నింద్రియ సంబంధము లేక

వానిని కొన్ని వేళల నాత్మను తెలిసికొనుచుండును. మన ముకప్పుడింద్రియ సంబంధములగువానిని, నొకప్పుడు మన లను మనమును తెలిసికొందుము.''

మైత్రేయి:—'' ఇంద్రియ సంబంధములగు విషయములను తెలిసికొనునపుడు మనలను మనము తెలిసికొనుట లేదా!''

కాత్యాయని:—'' మనమట్లు తెలిసికొనవచ్చును తెలిసికొనకనుపోవచ్చును.''

మైత్రేయి.—'' మనము తప్పకుండ తెలిసికొనెదము నేనీమునిని చూచునపుడు నేను చూచుచున్నానని నేను తల పకుండ నుండలేను.,'

కాత్యాయని.—'' ఏమాదిరిచూపు నీవుచూతువో నే నెఱుగనుగాని నామట్టుకు నేనాయనను చూచునప్పుడు నన్ను నేను సంపూర్ణముగ మఱచిపోదును.''

ఈ చివరిమాటకు ముని నవ్వకుండ నుండలేకపోయెను. కాత్యాయనీదేవియొక్క తనను మఱపించునట్టి ప్రేమయే యాజ్ఞవల్క్యుని కామెపై గల మోహమునకు కారణము. ఐనను నతనికి మైత్రేయికి తనయందుగల నిష్కపట భక్తి యందును, గౌరవమునందును గాఢమగు విశ్వాసముకూడ

కలదు. మైత్రేయి యేమిచేసినను నాత్మజ్ఞానముతో కూడ కొనియే చేసెను. ఆమె పూర్ణప్రబుద్ధాత్మురాలైయుండెను. కాత్యాయనీదేవి తనను గూర్చి యాలోచించుకొనుట కిపుడే మొదలిడినది. అయినను వారలసంభాషణమే విఘ్నము లేకుండ జరుగుచునే యుండెను.

యాజ్ఞవల్క్యుడు:—"మంచిది. కాత్యాయనీ! నీవు కేవలము నిన్నే తెలిసికొనునపుడు ఇంద్రియ సంబంధములగు విషయములను తెలిసికొనకుండ నుండునపుడు, ఇంద్రియ సంబంధములగునవి నీకు జ్ఞాపకముండునా?"

కాత్యాయని;—"ఔను. నాకొక్కొకపుడు జ్ఞాపకముండును."

యాజ్ఞవల్క్యుడు;—"ఒకప్పుడా విషయములను నీ వెఱిగియున్నట్లు నీకు జ్ఞాపకముండును కాదా?

కాత్యాయని;—"ఔను. నేనొకప్పుడు వానినెఱిగి యున్నట్లే జ్ఞాపకముండును."

యాజ్ఞవల్క్యుడు;—"అనగా నీయాత్మ వానినెఱిగి యున్నట్లు నీకు జ్ఞాపకముండును."

కాత్యాయని;—"ఔను."

యాజ్ఞవల్క్యుడు;—" అదియెట్లు! నీవెఱుఁగనిదానిని నీవు జ్ఞాపకముంచుకొనుటెట్లు!"

కాత్యాయని;—" నేనెఱుఁగనిదా! నేనేదియెఱుఁగను!

మైత్రేయి;—" ఇంద్రియ విషయములను తెలిసికొను నపుడు కొన్ని వేళల నాయాత్మను తెలిసికొనుటలేదనియు, మునినిఁజూచునపుడు నన్ను నేను మఱచిపోదుననియు నీవన లేదా!"

కాత్యాయని,—" ఔను. అంటిని. ఇంద్రియ విషయములను తెలిసికొనుటలో కొన్ని సమయములందు నన్ను నేను జ్ఞాపకముంచుకొందునని చెప్పినచో నందు పరస్పర విరుద్ధమేమికలదు!"

మైత్రేయి;—" ఎన్నడు నెఱుఁగనిదాని నెవరును జ్ఞాపకమునకు తెచ్చుకొననేరరు. తిరిగి జ్ఞప్తికి తెచ్చుకొనుట యనునది కేవలము తెలిసికొనెడు తెలివియొక్క పునఃప్రకాశమే"

కాత్యాయని;—" ఇంద్రియవిషయముల నెఱుఁగుటలో వానిని నేనెఱుఁగుచున్నానని నన్ను నేనెఱిఁగియుండనిచో, ఇంద్రియముల నెఱిఁగితినని నన్ను నేను జ్ఞాపకము చేసుకొనుట యసంభవమని నీయభిప్రాయమా!

మైత్రేయి:—"ఔను. అదియు నాయభిప్రాయము ఇంద్రియ విషయములను జ్ఞాపకముంచుకొనుటలో వానినెఱు గుదునని నిన్ను నీవు జ్ఞాపకముంచుకొనుచున్నావు. కావున వాని నెఱుగుదానవని నిన్ను నీవెఱిగినదాయుంటివని ఋజువై నది."

కాత్యాయని:—"ఓహో! నేగ్రహించినాను. కాని యిదిగొంచెము వింతవిషయమే. దీనినిగూర్చి యెక్కువగా విచారించిననేగాని నేను కడకీవిషయముపై నామనస్సును చొప్పింపజాలను. నేను నీతర్కముతో తారసిల్ల నేరను. కాని నీవనినట్లు తెలివియొక్క ప్రతికార్యమునందును మన లను మనము తెలిసికొనుచున్నప్పటికిని నేను చూచుచున్నా ను, నేను వినుచున్నాను యని మనమెల్లప్పుడు ననుకొనుట లేదే"

మైత్రేయి;—"నిజమే. మనమీమాటల ననుకొ నము. కాని మన యెఱుకయందీభావము సదా ప్రత్యక్ష ముగనుండును. ఎంతమందముగ, నెంతయసంపూర్ణముగ నుండిననుసరే ఆత్మజ్ఞానములేక మఱియొక జ్ఞానముండనే యుండదు. అని నావివాహమునకు పూర్వమీముని నా తండ్రిగారియింట చెప్పుచుండగా నేననేకసార్లు వినియున్నాను.

కాత్యాయని;—" నేనుకూడ వారినుండి యిదియంత యువినియుంటిని. కాని యర్థము చేసికొనియుండలేదు. నా కర్థము తెలిసినప్పటికిని దీనికిని మన సంభాషణమునందలి ముఖ్యాంశమునకును సంబంధమేమో యిప్పటికిని నేను గ్రహింపలేదు."

మైత్రేయి:—" సంబంధమిది. రెండవసారి యాత్మ వివరణము తెల్పినపిమ్మట నీవు ఆత్మయింద్రియ విషయము లనో, లేక యినను కానో తెలుసుకొనునని చెప్పితివి. ఆత్మను తెలుసుకొనుటనునది ప్రధానమై, మూలాధారమై యున్నద నియు, కావున నింద్రియవిషయములను తెలిసికొనుటలోకూడ మనయాత్మను తెలిసికొనుచున్నామనియు, నింద్రియ విషయ ములను తెలిసికొనని కాలమునఁగూడ మనయాత్మను తెలిసి కొనుచునే యున్నామనియు నిపుడు గ్రహించితివి."

కాత్యాయని;—" అటులేని రెండువిధములగు జ్ఞాన ములున్నట్లు తోచుచున్నది. ఒకటి యాత్మజ్ఞానము. అది మార్పులేనిది. స్థిరమైనది. రెండవది యింద్రియ విషయ ములను తెలిసికొనుజ్ఞానము. అది మారిపోవుచుండునది (పరివర్తనాశీలమైనది)"

మైత్రేయి;—" ఇంద్రియ విషయికజ్ఞానము పరివర్త నాశీలమైనదని యెందుకనెదవు."

కాత్యాయని;—"ఎందుకన నది యెల్లపుడు మనకు ప్రత్యక్షముగనుండదు. నేనీమునీంద్రుని చూచునపుడు నిన్ను సదా చూడలేను. నిన్ను చూచునపుడీ మునినాకు గోచరింపకపోవచ్చును."

మైత్రేయి;—"కాని యదృశ్యముగ నున్నట్టియు మఱపునఁబడియున్నట్టియు, పదార్థములను గూర్చిన జ్ఞానము తిరుగ మనకు కలుగుచున్నది. నేను నిన్నటిదినమున తెలిసికొని మఱచిపోయిన విషయములను నేడు తెలిసికొని నిన్న తెలిసికొనిన విషయము లేనని గుర్తించుచున్నాను. దీనినిబట్టి యాత్మజ్ఞానమెల్లు స్థిరమూ, యింద్రియ విషయిక జ్ఞానము నస్థిరమని తెలియుచుండ లేదా!"

కాత్యాయని;—"కాని యింద్రియ విషయిక జ్ఞానము వచ్చుచు, పోవుచునుండును ఆత్మజ్ఞానము సుస్థిరముగ నుండు నుగదా!'

యాజ్ఞవల్క్యుడు;—"ఒక్కొక ప్రత్యేక విషయిక జ్ఞానము పోవునపుడు దానితోడ నావిషయమును తెలిసికొను 'జ్ఞాతను' అనెడు మన యాత్మజ్ఞానముకూడపోవును. అట్టి తిని విషయజ్ఞానమువలెనే యాత్మజ్ఞానమును పరివర్తనాశీలమైనదని తెలియుచున్నది."

మైత్రేయి;—" కాని క్రొత్తవిషయమును తెలిసికొనునపుడంతకుపూర్వము తెలియబడినట్టి యితర విషయములను తెలిసికొనిన యాయాత్మనేయని నన్ను నేను తెలిసికొనుచున్నాను. కనుక రెండు విషయములలోను-అనగా ఆత్మజ్ఞానము, విషయజ్ఞానమునను ద్వివిధకర్మలలోను ఆత్మజ్ఞానము మస్థిరమైనదే"

యాజ్ఞవల్క్యుడు:—"నీవుదాహరించిన దానిని ననుసరించి యాత్మజ్ఞానమెంత స్థిరమో విషయజ్ఞానమును నంత స్థిరమైనదైయున్నది. ఒకటివెంట నొకటిగా జరుగునట్టి యీరెండు జ్ఞానకార్యములలోను జ్ఞానమునకు విషయములగు రెండువిషయములను భావనయందేకత్వమునకు తేవలయును"

మైత్రేయి:—"కాని సుషుప్తిదశయందు మనము విషయములను పూర్తిగా మఱచిపోదుము. ఐనను నాత్మజ్ఞానముండనేయుండును."

యాజ్ఞవల్క్యుడు:—"మనము జగత్తునుమఱతుమేని యాత్మనుకూడ మఱతుము. మనలను మనమెఱిగినపుడు విషయములను సైతమెఱిగెదము. ఆత్మజ్ఞానమని మనము దేనిని పిలుచుచున్నామో యది విషయజ్ఞానమువలెనే యస్థిరమైనదియు, గడచిపోవునదియునై యున్నది."

మైత్రేయి:—"నేనిదివఱకెన్నడు నెఱుగనంత మో
క్కుడు తాఱుమాఱు నాకిప్పుడొదవినది. మీరువచించినదా
నినిబట్టి ప్రతిదిపరివర్తనాశీలమై, వినాశమునకు సైత మాస్ప
దమైయున్నట్లు గోచరించుచున్నది. ఆత్మకేవలము జ్ఞాతగ
నుండగల్గును. కాని సుషుప్తిదశయందు విషయజ్ఞానముతో
పాటాత్మజ్ఞానమునుకూడ మనము గోల్పోవునట్లైన నికయాత్మ
క స్థిరత్వమేది? అంతియగాక సుషుప్తిలో జ్ఞానములేకపోయి
నచో జాగ్రదవస్థయందది యెట్లుతిరిగి గోచరించును!"

యాజ్ఞవల్క్యుడు:—"మనస్సునునిక్కమైన యాత్మ
యని భ్రమపడుటవలన నీకీతాఱుమాఱుకలిగినది. ఈ మన
సొక దృష్టిలో నాత్మయేయైయున్నది. మఱియొకదృష్టిలో
నాత్మనుండి వేఱైయున్నది. పైప్రశ్నయందలి మార్పులు
మనస్సునకు కలుగునే కాని యాత్మకుకాదు."

కాత్యాయని:—"మనసనగానేమి? అదియాత్మలో
నేకముగను, భిన్నముగనుకూడ యెట్లున్నది?"

యాజ్ఞవల్క్యుడు:—" మనము చెప్పుకొనుచున్న
మార్పులు తప్పకుండ నొకదానియొక్క మార్పునకు చెందిన
వని చెప్పవలయును. అవియొక వస్తువుయొక్క స్థితిభేదములు
కావలయును. ఆవస్తువాత్మకాదు. ఏమన జాగ్రదవస్థయందు

ప్రతిదిపునఃగోచరమగుట నీవు చూచునట్లు ప్రతిదియాత్మయందు స్థిరమైన స్థితికలిగియున్నది. కావున నీస్థితిభేదములకాధారమగుదాని నొకదానిని మనమూహింపవలయును. ఊహించకతప్పదు. దానినే మనస్సనిపిలుతుము. ఈదృష్టిలో మనస్సు ఆత్మనుండి వేరై యున్నది. కాని ప్రతివస్తువును నాత్మచేకాన ప్రతిదితప్పకుండ నాత్మకుసంబంధించినదేవనియు, దానియంశమేననియు మనము భావించితీరవలయును. ఈదృష్టిలో ప్రతిదానికి నాధారమైన మనస్సు 'ఆత్మ'తో నేకమైయున్నది.''

మైత్రేయి:—''ఆహా! నాకిపుడర్థమైనది. నాసంశయములేటుల నివారణమయ్యెను! అప్పటి మహాసభలో మీరాత్మను సర్వవస్తువులలో నుండునదియని—సర్వాంతర్యామియని వర్ణించియున్నారు. ఆసందర్భమున విభిన్నవస్తువులను పేర్కొనుటలో మనస్సునొక వస్తువునుగా మీరు చెప్పియున్నారు. మీరనినమాటలనే నేనుజ్ఞాపకముంచుకొంటిని శ్లో॥ యోమనసితిష్ఠన్, మనసోంతరో, యంమనోనవేద, యస్య మనశ్శరీరమ్, యోమనోంతరోయమయతి, ఏషత ఆత్మా, అంతర్యామ్యమృతః॥ ఎవడు మనస్సునందుండియు మనస్సునకు వేరైయున్నాడో, ఎవనిమనస్సెఱుగలేదో, ఎవనికి మనస్సు

* బృహదారణ్యకోపనిషత్తు, 111, 7

శరీరస్థమైయున్నదో, యెవడు మనస్సులోనుండి మనస్సును పాలించుచున్నాడో, వాడేనీయాత్మ, అంతర్యామి భావు, అమృతుడు) అనియు. భూమి, జలము, అగ్నియను నిట్టిపదార్థములకెల్లను నాత్మయేకర్త యనియు మీరు చెప్పియుంటిరి. అదంతయు చక్కగా నేనర్థముచేసికొంటిని కాని యితరపదార్థములవలెనే మనస్సుకూడ నాత్మనుండుంగక, నాత్మపైనాధారపడి, యాత్మచే పరిపాలింపబడుచున్నదను సంగతి నాకవుడు తెలిసినదికాదు. ఇపుడర్థమైనది."

కాత్యాయని:—"ఈరాత్రికింతవఱకు ముగింపకూడదా? చాలయాలస్యమగుచున్నది

మైత్రేయి:—"నాప్రశ్నకు సమాధానమింకను నెప్పుడునుండినంతదూరముగ నేయున్నది సమాధానము చెప్పబడినది నివడిగిన ప్రశ్నకే ఆత్మసహజముగా జ్ఞానముకలదనియు, దానిజ్ఞానము స్థిరమైనదియు, మార్పులేనిదియు ననియు మనము గ్రహించినాము. మఱియు నాత్మ మనస్సునుండి వేఱైయున్నదనియును మనము గ్రహించినాము నాప్రశ్నయే మనగా నియనన్యమగునేకాత్మయే యన్నిటిలోన నెట్లున్నది? ప్రతియొక్కరిలోను నొక ప్రత్యేకాత్మయున్నట్లు తోచుచున్నదిగదా? యని."

యాజ్ఞవల్క్యుడు:—"నీవు సత్యాత్మను తెలిసికొనినపుడు ఆత్మతప్పకుండ నేకమును, ననంతమునని నీవు తెలిసి

కొందువు. సాంకాత్మల మధ్యనున్న భేధములు పరిశుద్ధమగు వసంకాత్మకు సంబంధింపనేరవు. ఆభేదములు విజ్ఞానాత్మకు లేక, విజ్ఞానమునకు చెందినవి.

కాత్యాయని:—"విజ్ఞానమనగా మీయభిప్రాయ మేమి?"

మైత్రేయి:—"నేనుకూడ దీనిని తెలిసికొనవలెను. నాటిమహాసభలో నంతర్యామినిగూర్చి వివరించునపుడు మీ రాత్మనుండి మనస్సును వేఱుపఱచినట్లు విజ్ఞానమునుకూడ వేఱుపఱచియుంటిరి. ఆత్మకు మనస్సునకు కలభేదమును నేను గుర్తించినాను. కాని విజ్ఞానమునకు నాత్మకుమధ్య నేమి భేదముకలదో నాకుతోచుటలేదు."

కాత్యాయని:—"అన్ని సంగతులను నీవిట్లుజ్ఞాపక ముంచుకొందువు! బహుశా యీమునియొక్క మాటలను పొల్లుపోకుండ వల్లింతువేమో!"

మైత్రేయి:—ఔను నేను జ్ఞాపకముంచుకొందును. కాని యిందు నాగొప్పతనమంతగాలేదు. ఏమందువా! తన వ్యాఖ్యానము మనస్సున నాటుటకై యీముని ప్రతిభాగము నందును దాదాపుగ నొకేమాదిరిమాటల నుపయోగించును. విజ్ఞానమునుగూర్చి వారిట్లనుడివిరి."యోవిజ్ఞానేతిష్ఠన్, విజ్ఞా

నాదంతరో, యంవిజ్ఞానమ్నవేద, యస్యవిజ్ఞానంశరీరమ్ యో విజ్ఞానమంతరో యమయతి, ఏషతఆత్మా, అంతర్యామ్యమృతః॥

“ఎవడు విజ్ఞానములోనున్నవాడయ్యు విజ్ఞానమునుండి వేఱైయున్నాడో, యెవనిని విజ్ఞానమెఱుంగదో, యెవనికి విజ్ఞానము శరీరమైయున్నదో, యెవడువిజ్ఞానములోనుండి విజ్ఞానమును పరిశీలించుచున్నాడో, వాడేనీయాత్మ. అంతర్య ప్రభువు. అమృతుడు” పరిశుద్ధాత్మనుండి విజ్ఞానమెట్లు విడదీయబడుచున్నదో యావిషయమును నేనిపుడెఱుగ గోరెదను.

కాత్యాయని:—“ముందుమాకు విజ్ఞానమననేమో తెల్పుడు. మనలో ప్రతిప్రాణియందును విజ్ఞానమనునది కలదని మనమెట్లు తెలిసికొందుమో తెలియజేయుడు!”

యాజ్ఞవల్క్యుడు:—“మీకు ప్రతివిషయమును విశదపఱచి తెలుపుటకు నేనెంతైన సంతసింతును కాని నావివరణమువలన మీకేమైన తృప్తికలుగునప్పటికి చాలరాత్రి యగును. అంతదనుక కూర్చుండుటకు మీరు సిద్ధముగనున్నారా!”

మైత్రేయి:“యినేను సంసిద్ధముగనున్నాను. నేనీరాత్రి యంతయు కూర్చుండగలను.”

కాత్యాయని:—"నేనుమాత్రమట్లు చెప్ప లేను. నాకిప్ప టికే బడలికయు, నిద్రయు ద[illegible]రించుచున్నవి."

మైత్రేయి:—"అటులైన నీవుపోయి విశ్రమించిన న్నింకనొక కొంతసేపు మునివరునితో మాట్లాడనీయరాదా! మేము మాట్లాడినదానిని రేపు నీకు వివరించిచెప్పెదను."

కాత్యాయని:—"ప్రతిమాట నేనుస్వయముగా విని ననేగాని నాకుతృప్తికలుగదు. కాన నిక్కడికాపి విశ్రమించు టమంచిది. అంతియేగాక నిదురింపకపూర్వము మునీశ్వరు నితో నేనొకసంగతినిగూర్చి మాట్లాడవలసియున్నది."

మైత్రేయి:—"యీసూచనను గ్రహించి తన సవతిని భర్తతోఁగూడ శయనించుటకుఁబోనిచ్చి తాను తన యలవా టుననుసరించి రాత్రి చాలగడచువఱకు తపోగృహములో కూర్చుండి ఋషివలన తానువినినదంతయు ధ్యానించుచుండె ను. ఋషీంద్రుని దేహము కాత్యాయనితోనుండెను, కాని యతినియాత్మ మైత్రేయిచెంతనే నిలచెను.

---

# చతుర్థ ప్రకరణము.

---

మఱుదినము సాయంకాలసమయమున తిరిగి చర్చ ప్రారంభమయ్యెను. యాజ్ఞవల్క్యుడే యిట్లు మొదలిడెను.

యాజ్ఞవల్క్యుడు:—"మనము ప్రతివారము దేనిని మనయాత్మయని పిలుచుచున్నామో యది సర్వవిశ్వప్రపంచము యొక్క ఆత్మయైయున్నదని తెలిపినచో మీ కాత్మయొక్క యేకత్వము విశదముకాగలదు. కాని వ్యక్తిగతాత్మయు, విశ్వాత్మయు నొక్కటేననుసంగతి మనకెట్లు తెలియును? నిన్న మీకు నేనెఱింగించినట్లు సత్యాత్మ—విశ్వాత్మ కేవలమవిభక్తమైనదిగా తెలిసికొనబడవలసినదై యున్నది. జనులుదాని నెఱుగకనుండఁగఱలోను, నన్నిటిలోనునున్నదా యాత్మయే నని గుర్తింపకున్నారు. పరమాత్మనుగూర్చి మీకేమైన జ్ఞాపకముకలదా? అనేకమందికివలెనే మీకునునవిచారక విశ్వసింపదగిన వస్తువుమాత్రమేనా? నాకీసంగతి నెఱుకచేయుము."

మైత్రేయి:—"ప్రతిది బ్రహ్మమేనని తఱచుగ నేను విని యుంటిని. ఏసమయమున, నెద్దానిని తెలిసికొనినను దానితో పాటు దానిలోనున్న జగదాత్మను మనము తెలిసికొనెదమను నిశ్చితాభిప్రాయమొకటి నాకుకలదు. కాని నాభావము

నెంతవఱకు తెలియఁగల్గెదనో నేనెఱుఁగను.''

కాత్యాయని:—'' తెలుపఁగలిగినమట్టుకు తెలుపఁదల్చింపుము.''

యాజ్ఞవల్క్యుఁడు:—''నిన్నటి మనసంభాషణము మనకు తోడ్పడును. చెప్పుఁడు ఈగదిని తెలిసికొనుటలో మీరింక దేనినైన తెలిసికొనుచున్నారేమో చెప్పుఁడు.''

మైత్రేయి:—''ఈగదిని తెలిసికొనుటలో నేనీగదిని తెలిసికొనుచున్నానని నన్ను నేను తెలిసికొనుచున్నాను.''

యాజ్ఞవల్క్యుఁడు:—'' ఈగదిని తెలిసికొనుటలో నీ యాత్మనుగాక మఱియేయాత్మనైన నీవు తెలిసికొనుచున్నావా ?

మైత్రేయి:—''లేదు''

యాజ్ఞవల్క్యుఁడు:—''కాని యీగది జగదాత్మయందున్నదని నీవెఱుఁగుదువు. లేక యట్లుండునని నమ్ముదువు. కాదా!''

మైత్రేయి:—'' ఔను నేనదివిశ్వసింతును. కాని యద్దాని నర్థముచేసికొనలేను.''

యాజ్ఞవల్క్యుడు:—"క్రమక్రమముగ నీవర్థముచేసి కొనెదవు. ఈగదినిగూర్చి తెలియబడినదియను భావమువి నాయితరభావమేదైన కలదేమో నాకిప్పుడు చెప్పుము."

మైత్రేయి:—"ఇప్పుడిది తెలియబడినదేకాని కొన్ని వేళలనిది తెలియబడకుండ నుండవచ్చును."

యాజ్ఞవల్క్యుడు:—"తెలియబడకుండ నుండునపుడు నునది యిపుడున్నయటుల దేరీతిగానుండునా!"

మైత్రేయి:—"అట్లేయ దేరీతిగానుండును."

యాజ్ఞవల్క్యుడు:—"కాని యిపుడది తెలియబడుచు—అనగా చూడబడుచు, తాకబడుచునున్నది. తెలియబడకుండనుండునపుడును నిట్లేజరుగునా!"

మైత్రేయి:—"అట్లుతప్పక జరుగవలెకాని తెలియబడినవస్తువు తెలియబడకుండనుండునపుడుకూడ తెలియబడినప్పటివలె నదేరీతిగానుండునని చెప్పుటలో నామాట నాకే విరుద్ధముగనున్నది."

యాజ్ఞవల్క్యుడు:—"నీకునిక్కముగ నట్లేవిరుద్ధముగనుండును. ప్రపంచముయొక్క యదార్థస్థితి నెవ్వరెఱుంగరో వారందఱు నట్లేయుండును."

మైత్రేయి:—"అట్లని యీగది యెల్లప్పుడును తెలియ బడియున్నదేదని భావింపవలయునని నేను చెప్పితీరవలసినట్లు నాకు గోచరించుచున్నది."

కాత్యాయని:—"ఈగది తెలియబడకుండ నుండున ప్పుడు దానియితర సొత్తులన్నియు దానియందుండుననియు, తెలియబడుట మాత్రము మారిపోవుననియు మనము చెప్పెద మనుకొనుము."

మైత్రేయి:—"అదియెట్లు పొసగును? గదియొక్క సొత్తులన్నియు తెలియబడిన సొత్తులై యుండెను. గది దాని సొత్తులన్నిటితో సహా తెలియబడిన విషయమైయున్నది. తెలి యబడిన విషయమును భావమువినా గదినిగూర్చి వేఱొక భావము నాకు లేదనియే నాకు తోచుచున్నది."

యాజ్ఞవల్క్యుడు:—"అటులైన నీచేత సదా గది తెలి సికొనబడునదియని నీవెంచకతప్పదు. అదితప్ప వేఱొక భావ ము నీకు లేదని నీవనినావు."

మైత్రేయి;—"నాచేతను మాత్రమేకాదు. అది యితరులచేతను తెలిసికొనబడవచ్చును."

యాజ్ఞవల్క్యుడు;—"కాని యిప్పుడది నీజ్ఞానమునందు న్నది."

మైత్రేయి;—"భావ[illegible]యున్నది.

యాజ్ఞవల్క్యుడు;—"దానియొక్క ప్రతిభాగము నీ మెదడుయందున్నదిగదా!"

మైత్రేయి;—"ఔను ప్రతిభాగము నా మెదడుయందున్నది."

యాజ్ఞవల్క్యుడు;— "నీమెదడు నీ నీయాత్మ. ఔనా."

మైత్రేయి;—ఔను"ఔను"

యాజ్ఞవల్క్యుడు;—" ఐనచో గది నీ యాత్మలోనున్నదా? లేక నీ యాత్మ గదిలోనున్నదా?"

మైత్రేయి;—అట్లు నిట్లుకూడ తోచును."

యాజ్ఞవల్క్యుడు;—" నీవిపుడు తలిసికొనుచున్నట్లే యెల్లపుడు నీ గదియుండునా!"

మైత్రేయి;—"తప్పకుండ."

యాజ్ఞవల్క్యుడు;—"అనగా గది నీ యాత్మయందుండ సాగునా? లేక నీ దేహము దూరముగనున్నను నీయాత్మ యీ గదిలోనుండసాగునా?"

మైత్రేయి;—"దీనివంతయు నేనంగీకరింపక తప్పదని నాకుతోచుచున్నది. కాని యిదియెంతవింతగనున్నది."

యాజ్ఞవల్క్యుడు;—"ఈవింతపుట్టుటకు హేతువిది. మనుజులు తాము విషయములను తెలిసికొనునపుడు తమ యాత్మను వానిలోనికి తెచ్చినట్లును, విషయములు తమకు దూరమైనపుడు వానినుండి తమయాత్మను తీసివేసినట్లును భావించి భ్రమించుచున్నారు. వాస్తవమదికాదు. ఏమనగా విషయములను తెలిసికొనునపుడు వానియందు నిహితమై యున్న యాత్మను మనము కనుగొనుచున్నాము. ఆయాత్మ వానిలోనున్నది. వానియునికికాధారమైయున్నది. ఆయాత్మ వానికిని మనకును సాధారణాత్మయైయున్నది."

మైత్రేయి;—"మీ యీకొన్నివాక్యములనుండి నే నెంత నేర్చికొంటిని!"

కాత్యాయని:—"విషయములను తెలిసికొనునపుడు వానియందలి యాత్మను మనము కనుగొనెదమని మీరు నుడివినారు. ఆవిషయములలోని యాత్మను మనము కనుగొనక పూర్వముకూడ నది వానియందున్నదా?"

యాజ్ఞవల్క్యుడు;—"నిశ్చయముగనున్నది."

కాత్యాయని:—"విశ్వాత్మయనునదదియేనా!"

యాజ్ఞవల్క్యుడు:—"ఔనదియేవిశ్వాత్మ."

మైత్రేయి:—"ఆమహాసభలో మీరు తెలిపియుండిన దారమువలె బంధించెడు సూత్రాత్మకూడనదియే కాదా!"

యాజ్ఞవల్క్యుడు:—"ఔను నేనపుడు తెల్పినసూత్రాత్మకూడనదియే. కాని యాసభలో నాడు నేను సూత్రాత్మను గూర్చి చేసిన వ్యాఖ్యానమొకవిధముగా పై పైది. లోతుగ చొచ్చినదికాదు."

మైత్రేయి:—"ఇపుడు దానినిగూర్చి యొక్కువవిశదముగా మాకెఱిగింపుడు."

యాజ్ఞవల్క్యుడు:—"నీవిదివఱకే దానిసర్థముచేసికొనుమార్గములోనున్నావు. సూత్రాత్మ వస్తుసముదయము నెట్లుబంధించుచున్నదో యోచించి తెలుపుము."

మైత్రేయి:—"అది నన్నును, నాచే తెలిసికొనబడు వస్తువులను కలిపి బంధించును. అదినాలోను, వానిలోను నున్నది. అది వానియాత్మయు నాస్వంతయాత్మయు రెండును నై యున్నది. ఆసభలో మీరుపల్కినట్టి యావల్కులనే యించుమించుగావల్లె వేయుటకు నిర్బంధింపబడినందుకు నే

నెంత యిష్టముగ నాశ్చర్యపడుచున్నానుగో"

కాత్యాయని:—"అదినిన్నును, నన్నును నెట్లుబంధించును? నీయాత్మయే నాయాత్మయని నేనెట్లు తెలిసికొనగలను?"

మైత్రేయి:—"ప్రపంచమును తెలిసికొనుటలో విశ్వాత్మయు, నీయాత్మయు నొక్కటేనని నీవు తెలిసికొందువు. ప్రపంచమునుగూర్చిన నాజ్ఞానము జగదాత్మకును, నాయాత్మకునుగల యభేదస్థితిని నాకు ప్రకటపఱచును. కావున దీనిని బట్టి నీలోనియాత్మయు, నాలోనియాత్మయు నొకటియే యని తెలిసికొందుము"

కాత్యాయని:—"అటులనా! నీకును, నాకును మధ్య భేదములుకూడకలవే, యెట్లో తెలుపుము!"

యాజ్ఞవల్క్యుడు:—"విజ్ఞానాత్మనుగూర్చి నేను తెలుపునపుడే భేదములనుగూర్చి తెలుపబడును. ఇపుడు సూత్రాత్మనుగూర్చి మీకింకను తెలిసియున్న తెలుపుము."

మైత్రేయి:—"స్థలముయొక్క విభిన్నభాగములను సూత్రాత్మ బంధించునట్లు తోచుచున్నది. స్థలముయొక్క వివిధభాగములుకలిసియున్నట్లు తెలిసికొనుటలోను, కాలాం

చుటలోను నేను వానినొక తెలిసికొనునాత్మయందున్నవానిని గా తెలిసికొనుచు యోచించుచున్నాను."

యాజ్ఞవల్క్యుడు:—"మఱియు స్థలములయొక్క సకల భాగములు కలుపబడియున్నవనియు, ప్రత్యేకస్థలములెల్ల నొక యవిభక్తస్థలములో నిమిడియున్నవనియు నీకు తెలియును."

మైత్రేయి:—"నాకు తెలియును. దీనిబట్టి విశ్వాత్మ యనగా సూత్రాత్మ నేకమునవిభక్తమునని తేలుటలేదా."

యాజ్ఞవల్క్యుడు:—"నిస్సందేహముగనట్లు తెలియు చున్నది. నాసూచనలను నీవెంతచిత్రముగా ననుసరింతువు! చూడుము. విశ్వాత్మస్థలమంతటిలోనున్నది. అంతేగాదు స్థల మంతయు విశ్వాత్మలోనేయున్నది. అనగా విశ్వాత్మస్థలమున కతీతుడు. అంతేస్థలముయొక్క విభాగములకతీతుడుకాడా దయచేసి నీవుచెప్పుము."

మైత్రేయి:—"మఱియు నీవిశ్వాత్మకాలములయొక్క వివిధాంతరములను కలిపి కట్టుచున్నది. ఏనున నదియొకటి వెంబడి నొకటిగా సంభవించెడు కార్యములకు మార్పునొందని సాక్షియైయున్నదని నాకుతోచుచున్నది."

యాజ్ఞవల్క్యుడు:—"కేవలమంతియేమి. కావునవిశ్వా త్మకాలాతీతుడు. శాశ్వతుడునని నీవుగ్రహించినావు."

శాక్యాయని:—"మార్పులు లేనివాడగుటచే విశ్వాత్మ శాశ్వతుడని మీరు భావింతురా! అటులేని సృష్టిలోనియీ మార్పు లేవేవి!"

యాజ్ఞవల్క్యుడు:—"మార్పులన్నియు మనస్సువే."

శాక్యాయని:—"కాని మనలోని మనస్సు పరిమితమైనది. విశ్వపరివర్తనములు దానిమార్పులు కానేరవు."

యాజ్ఞవల్క్యుడు:—"కాబట్టి విశ్వపరివర్తనములకు మూలాధారమగు విశ్వమనస్సును మనమూహించక తప్పదని తెలిసికొమ్ము."

శాక్యాయని:—"కాని విశ్వవ్యవహారములను తెలిసికొనునపుడు జగదాత్మ మార్పునొందదా!"

యాజ్ఞవల్క్యుడు:—"జ్ఞానము మార్పుకాదు అది యాత్మయొక్క స్థిరాస్థితియైయున్నది. మైత్రేయి తెలిపినట్లు జగదాత్మ జగద్వ్యాపారములయొక్క మార్పు లేని సాక్షియై యున్నది. వ్యాపారములను తెలిసికొనెడు జ్ఞానముమాత్రము వ్యాపారము కానేరదు. దీనిననుసరించి కార్యములను తెలిసికొనెడు జ్ఞానమా కార్యసంఘటనలకు పూర్వమునను పరము ననుకూడ విశ్వాత్మయందు స్థితమైయున్నదని తెలియుచున్నది. ఆయనకిచ్చుట, యిచ్చుటయను భేదము లేనట్లే యిప్పుడు,

వస్తువునకు భేదములేదు.

మైత్రేయి:—"కావున నేమటి మన మనస్సులనుండిపోయి కొంతకాలముగోచరముగనుండు విషయములు మరల మనస్స్మరణకువచ్చి మఱపునబడియున్నంతకాలము కాయుండిన సంగతిని కనుబఱచును."

కాత్యాయని:—"కాని మనజ్ఞానమునకుమార్పు కాదా నేనీగతిని తెలిసికొనునపుడు నేనజ్ఞాన స్థితినుండి జ్ఞానస్థితికి పోవుచున్నాను. ఈరీతిగా మార్పుకలదు.

మైత్రేయి;—"కాని మనము గదినెఱుగకముందే గదినిగూర్చిన జ్ఞానము విశ్వాత్మయందున్నది. విశ్వాత్మకిది యొకకార్యముకాదు. జ్ఞానమాతనిసొత్తు, కాకున్న నతని నిజ స్వభావము."

యాజ్ఞవల్క్యుడు.—"అతనినిగూర్చి తెలిసికొనువాడని చెప్పవలనుకాదు. తెలిసినవాడనిమాత్రమే చెప్పనగును. అతండకర్తయు, నిష్క్రియుడునై యున్నాడు."

కాత్యాయని;—"కాని యీగదినో మఱియేయితర వస్తువునో తెలిసికొనునపుడేమి సంభవించును?" అపుడు నా యాత్మయనిచేయుదా ? ఆత్మయొక్క జ్ఞానము దానికార్యము కాదా?"

• బృహదారణ్యకోపనిషత్తు IV 3, 22,—30.

యాజ్ఞవల్క్యుడు;—"ఇచట నీవు విజ్ఞానాత్మను ప్రశ్నించుచున్నావు. విశ్వాత్మ సర్వవ్యాపియగుటచే పనిచేయదు. మార్పుపొందదు. ప్రతివిషయముయొక్కయు, ప్రతి కార్యము యొక్కయు జ్ఞానమూర్తిలో స్వాతంత్ర్యముననుండును. కాని యొకానొక గూఢమార్గమున తనలో నొకభాగమును వ్యక్తిగతాత్మగా విడదీసినట్లువలె వెలువరించును. ఈవ్యక్తిగతాత్మయదివఱకు తనకు తెలియబడని విషయమును తెలిసికొనుటకై యజ్ఞానదశనుండివచ్చుచున్న కర్తవలెకనుబడును. జగదాత్మయే వ్యక్తిగతాత్మగా నన్యధాకరించబడి విజ్ఞానాత్మయని పిలువబడుచున్నది. స్వరూపమునందిది విశ్వాత్మలోనే కమైయున్నది. కాని విశ్వాత్మలోనిమిడియున్నవానిని భాగములుగను, ప్రత్యేకదేశ, కాలములుగను తెలిసికొనుచున్నందున నది జగదాత్మకు భిన్నమైయున్నది."

మైత్రేయి,—"మీ వ్యాఖ్యానము ప్రశ్నతో [illegible] చేసినది. ఇప్పటికిక నాకు తీర్పఁగలిగిన శంకలెవ్వియు లేవు కష్టమంతయు పూర్వాభిప్రాయములను విదలించివైచుటయందే యున్నది. ఇట్టిభావములన్నిటిలోను [illegible] నొక భావము ప్రపంచములో కేవలమునింద్రియములకు సంబంధించిన విషయములేకలవు, ప్రపంచమును తెలిసికొనుటలో మనము

కేవలముట్టికాని కొంతయోయాత్మకును సంబంధించని విషయము లనే తెలిసికొందుము, అనునట్టిదై యున్నది. కాని నిన్నటి సంభాషణమున మీరు మనము దేనిని తెలిసికొనినను దానితోపాటాత్మను తప్పక తెలిసికొందుమనియు, నాత్మకు వేఱుగ నేదియు తెలియబడనేరదనియు మాకువిశదపఱచియున్నారు. నేటిసంభాషణవలన మనమాత్మకు వేఱుగ వస్తువులను భావింపజాలమనియు, వస్తువులను భావించునపుడు మనమునిక్కముగా కానినాత్మకుసంబంధించినట్టి లేక యాత్మలోనుండునట్టికానినిగా భావింతుమనియు, నాకుస్పష్టపడినది. గది తెలియబడకుంతనుండునని నేనుభావింపగలనని చెప్పునపుడు నేను పొరపాటుపడినట్లే మనవిశ్వాసమునుగూర్చి వివరింపఁబోయి మనము విచిత్రమగు భ్రమనుపొందినప్పటికిని మనము నిశ్చయముగా జగత్తు ఆత్మలోనున్నదని విశ్వసింతుము. మఱియొకవిధముగా విశ్వసింపగలుగుట యసంభవమను ముగింపునై రము తేటతెల్లముగను, తిరుగులేనిదిగనునున్నది."

కాత్యాయని:—"వాదసూత్రములనెల్ల నొక్కచో ప్రోగుచేసి నీవిశ్వాసములో నెట్లుచేర్చెదవు? వేగముగబోవునట్టి యావాదసూత్రరాశిని నామందబుద్ధి గ్రహించునట్లు నెట్లుతోడ్పడెదవు? నీవులేకున్న నేనేమిచేయగలిగెడిదానను!"

మైత్రేయి:—"ప్రొగడబడుటను సహింపలేక కొందఱ

చేయబడి హైతే)యియిట్లనెను.) నీవునాతో ముఖ్యముగ నిట్టి ప్రమాణము నజగడమూడకూడదు, నివారింపవలసిన కష్టము లేమైన నీకున్నచో కొంచెము చెప్పుము.''

కాత్యాయని;—''తర్కమంతయు సంగ్రహించి తెలుపుటద్వారా అనగా మనము జగత్తునాత్మలో తెలిసికొనుచున్నాము. మనము జగత్తు నాత్మలో భావించుచున్నాము. కావున మనము తప్పకుండ జగత్తు నాత్మలోనున్నదని విశ్వసించితీరవలయునని తెలియజేయుటద్వారా నీవు నాకష్టమును తొలగించితివని నేనిపుడేయంటిని. ఆత్మలేని జగత్తుమనకు తెలియనిదియు, మనము భావింపనిదియు, మనము విశ్వసింపనిదియునగు వస్తువని నాకు తెలిసినది. అట్టిప్రపంచమును గూర్చి మనము మాటలనుమాత్రము చెప్పెదము. అదివట్టి మాటలతో నిర్మితమైనది మాత్రమే—వాచారంభణమ్. *అని వేదాంతులు చెప్పెదరు. నేనిపుడా వాక్యభాగముయొక్క భావమును గ్రహించితిని.''

యాజ్ఞవల్క్యుడు;—'' కాత్యాయనీ! సమగ్రవాద మర్మమును నీవుగ్రహించినందుకు నేనపరిమితానందము నొందుచున్నాను. ఇపుడింకను మీఱడుగవలసినదేమైన కలదా!''

* ఛాందోగ్యోపనిషత్, ప్రపాఠకము 6.

మైత్రేయి;—"పూర్వాభిప్రాయములను విడల్చి వైచుట కష్టమని చెప్పియుంటిని. అట్టివానియందొకదానిని గూర్చి వర్ణించియుంటిని. వేఱొకదానినిగూర్చి చెప్పెదను, మనము వాడుకగా మనయందలి యాత్మనొకచిన్నవస్తువుగ గా భావింతుము. ప్రపంచమెంత పెద్దదో ఆత్మయు నంత పెద్దదనిగాని దేశ, కాలాతీతమైనదగుటచేనది ప్రపంచ మునకంటె నెక్కువపెద్దదనిగాని మనము భావింపలేకున్నాము. కాని యీకష్టమును నివారించుకొనుటకునకూడ మీరు మా కొసగియున్నారు. మన శాస్త్రము సర్వతోముఖత్వము ప్రత్యేకత్వమునను ద్వివిధలక్షణములు కలవని మీరుచూపి నారు. సర్వతోముఖత్వమునందు పరమాత్మగా యాత్మయు నంతమై ప్రతిదానిని తనలో నిముడ్చుకొనియుండును. ప్రత్యే కత్వమునందు విజ్ఞానాత్మగా సీమాబద్ధమై—సాంతమై జగత్తు లోనొకభాగమును మాత్రమే తెలిసికొనుచుండును. ఈభేద ము నాకష్టములలో నాకుమహోపకారము చేయును. విజ్ఞా నాత్మగాతనను తానుప్రత్యేకించుకొనుటలో నాయనంతుడు తనజ్ఞానములో నొకభాగమునకు చుట్టునొకప్రాకారవలయము నుగీచినట్లు హద్దుపెట్టితద్వారా తాను కార్యముచేత సీమా బద్ధుడై పోవును. ఈవిషయము నీరీతిగా యోజించునప్పుడు నేనంతునితో స్వరూపభేదము లేక నేకత్వము కలిగియున్నను,

* ఛాందోగ్యోపనిషత్, ప్రపాఠకము 6.

సాంకేతికజ్ఞానములోడను నకర్తలతోడను గూడియున్నా నో యాసంగతి నాకస్పష్టముగనైనను తెలియబడుచున్నది. కాని మనయనంతునితో సంబంధములేని స్వాతంత్ర్యమనునట్టి యభ్యాసముగనున్న విశ్వాసమును కదలించి, విదలించివైచుట మహాకష్టము.''

యాజ్ఞవల్క్యుడు;—''ఇక రెండు విషయములను జ్ఞాపకముంచుకొనునెడల దీనినివిదల్చివైచుట సులభమని మీకు కన్పట్టును. అందొకటి నీవు తెల్పినట్టి యాత్మనుచుట్టుకొనిన ప్రాకారివంటిహద్దు పూర్వమగోచరముగనుండిన విషయములు గోచరించిన కొలదిని విశాలమగుచుండుననునది. ఎడతెగకుండనిట్టులాహద్దుపొందెడు వైశాల్యము మనకపుడు నూతనముగా మనము విశ్వాత్మతోడనేకీభవించి యతనితో ననోన్యసంబంధము కల్గియున్నామని తెలియజేయుచుండును. రెండవదినిరంతరము భావింపబడునుమస్తి. అదిపైకి కన్పడునట్టి మనయొక్క స్వతంత్రస్థితిని కొంతకాలమువఱకు నిలిపివేసి మనలను తిరుగనాయనంతునిలోనికీడ్చి మనముపూర్తిగా నతనిపై నాధారపడియున్న సంగతిని తెలిపికేకుండ జ్ఞాపకము చేయును.''

మైత్రేయి:—''మీసూచనలు మహావిలువగలవి. నాకవి గొప్పసాయము చేయును.''

## XI.

కాత్యాయని:—"ఈనాడు దినముచాలినంత సంగ్రహించలేదా ? ఇప్పటికి విశ్రమింపకూడదా!"

మైత్రేయి:—"ఈదినమునకు మాత్రమేకాదు. అనేక దినములకు చాలినంత సంగ్రహించినాను. కాని నేనిప్పుడు శయనింపజాలను. నిదురింపబోవుటకుమున్ను నేను మునివరుని వలన వినినట్టి యద్భుతవిషయములనుగుఱించి యోచించి సాధ్యమైనంతవఱకు నర్థముచేసికొనయత్నింతును. అనుమతి కావలసియున్న నీకు నాయనుమతికలదు. నీవు మునితోఁ గూడ శయనింపబోవచ్చును."

కాత్యాయనీదేవియు, ఋషియు విశ్రమించిరి. మైత్రేయివాడుకచొప్పున ధ్యానించుచు కూర్చుండెను. కాని యొక నూత్నవిశేషమానాటిరాత్రి సంభవించినది. ఉపదేశికుడు తెలిపిన క్రమములను ధ్యానించుచుండ నామెకనంతుడగు శాశ్వతునియొక్క దర్శనము తిన్నగాలభించెను. దేవునితోడి యనన్యసంబంధానుభూతివలనియానందాతిశయముచే నామెయాత్మ పూరింపబడెను. మొదటికాకుననే యీదివ్యానందములసమానములనియు, నెంతహెచ్చైనవైనను ప్రాపంచికానందములు వీనితోఁ బోల్పదగినవికావనియు నామెకనుభూతమయ్యెను. అప్పటినుండియు చలింపనిస్థైర్యముతోడ నామె

బ్రహ్మాదివ్యాసంతతుల నన్వేషింపసాగెను. ధనయభివృద్ధిని కట్టునదియు, చివరిదగు మోక్షమునకును, శాశ్వతునితోడి ఐక్యమునకును నభ్యంతరము కలుగచేయునట్టిదియునగు విష యేచ్ఛలను క్రమక్రమముగా పోగొట్టుకొని యాత్మ పారిశు ద్ధ్యమును సంపాదించుకొనెను. ఆమె పెనిమిటి వృద్ధాప్యమున ప్రపంచవ్యాపారములువీడి యేకాంతవాసము చేయబోవునప్పు డామె ప్రాపంచికకోర్కెలనుండి విముక్తయైయుండెను భర్తయొక్క యాస్తిలో ఐహికవస్తువులలో నేమియు భాగ మును తీసికొనకవలదని త్రోసివేసి యమృతత్వమునుగూర్చిన బోధనుమాత్రము చేయుమనికోరెను. "అమృతత్వమును దేని వలన పొందలేనో యట్టిదానితోనే నేమిచేయుదును ! అమృ తత్వమునుగూర్చి మీకేమి తెలియును ! ఆర్యా ! దయచేసి విశదముగ నాకెఱిగింపుడు." అనిపలికెను.

• బృహదారణ్యకోపనిషత్తులో 11.4.IV.5

# పంచమ ప్రకరణము.

యాజ్ఞవల్క్యుడు తనభార్యలకు భర్తగను, గురువుగనునుండిన సంగతిని మనము కొంతవఱకెఱింగితిమి. ఇంక విస్తృత జనసంఘములకు బోధించునాచార్యునిగ నతనినిగూర్చి కొంచెము కేవలమొకకొంచెము తెలిసికొందుము. వేదములను బోధించువిషయమున నతనికీర్తి హెచ్చుగా వ్యాపించినందున నధికసంఖ్యాకులగు విద్యార్థులాయధ్యాపకుని కడకు రాసాగిరి. ఆకాలపురీతిననుసరించి శిష్యులకుగురుగృహములో భోజనాదులనమర్పుటకు యాజ్ఞవల్క్యునకు సాధ్యముకాకపోవుటచే జనకమహారాజు దాతృత్వముతో స్వగృహముచెంత నొకవసతిగృహము నతడుకట్టించెను. ఆశాలయందు యాజ్ఞవల్క్యుని సహాయులుచేయు సవ్యవస్థాన పరామరికతో విద్యార్థులు వసించుచుండిరి. యాజ్ఞవల్క్యఋషి యేర్పాటులనెల్ల విచారించుచు నిర్ణీతసమయములందు శిష్యులకు పాఠముచెప్పుచునుండెను. విద్యార్థులలో మూడుద్విజవర్ణములకు చెందినవారును, గొప్పతనమునందు సంఘములోని సకల శ్రేణులనుండివచ్చి కూడినవారునునుండిరి ఇందురాజకుమారులుండిరి, సాధారణవర్తకులపుత్రులును, శిల్పులు, కృషీవలులునగువారి కుమారులునునుండిరి. కాని వీరందరునొక్క మాదిరిగానే యాదరింపబడుచుండిరి. సౌకర్యములు, శ్రమలు

విధులుయివన్నియు నందఱకు సమానముగనుండెను. ఒక్క మాదిరిభోజనము. ఒక్కమాదిరిపడక ఒక్కమాదిరివ్యాయామక్రీడలు విధింపబడెను. వీరిలో విద్యాశాలలోని చదువుగాక దానితోపాటు యుద్ధశిక్ష నభ్యసించువారికిమాత్రము వేఱు విధముగ నేర్పాటులు చేయబడియుండెను. ఇప్పుడీ యాధునికకాలమునసున్న కఠోర కులభేదమును వారెఱుగరు. విద్యార్థులందరు కలసి భోజనపానములొనర్చుచు నొకరితోనొకరు సమభావమున వర్తించువారు. వృత్తి విభజనము ననుసరించి వ్యక్తుల వివాహము లాదినములలో సాధారణాచారముగ నుండిన మాటనిక్కమే. ఐనను వర్ణాంతర వైవాహికములు తఱచుగ జరుగుచుండెడివి. అనులోమజాతి—ఎక్కువజాతి పురుషునితో తక్కువజాతి స్త్రీకి వివాహము. ఇట్టివి ముఖ్యముగా జరుగుచుండెడివి. విలోమజాతి—ఎక్కువజాతి స్త్రీతో తక్కువజాతి పురుషునకు జరుగుపెండ్లి. ఇట్టివి చాల అరుదుగ జరిగెడివి. కాని యసలే లేకుండనుండ లేదు. క్షత్రియ ముఖ్యులు యితరజాతివలె నొక్కొకపుడు బ్రాహ్మణ భార్యలు కలవారై యుండిరి. క్షత్రియ కన్యకల స్వయంవరములలో కులభేదములు క్రమపరికారము నిరాకరింపబడి యుండెను, అట్లగుట, యాజ్ఞవల్క్యుని పాఠశాలలోని విద్యార్థులయందు చాలమంది యొకరితో నొకరు రక్తసంబంధము చేతను, వివాహ సంబంధముచేతను బంధుత్వముకలవారై

యుండిరి. మఱియు నతిథి సత్కారపూరితమును, సౌగన్య హవాసము చేయు నా విద్యార్థులలో ఫలవంతమగు నేలలో పెరుగునట్టి మొక్కలవలె వర్ధిల్లెడు సత్సాహచరితములగు లేఁబ్రాయపు స్నేహభావములలో నన్నని బంధుత్వములకు పూర్ణాదులు వేయబడినవి.

యాజ్ఞవల్క్యఋషియొక్క నామము ముఖ్యముగా యజుర్వేదమునకు సంబంధించియున్నప్పటికి యతడు ఋక్, సామ, యజుర్వేదములను మూడు వేదములందును ప్రవీణు డైయుండెను. ఆ ప్రాచీన కాలమున నా మూడు వేదములు నేర్పబడెడివి. యాజ్ఞవల్క్య డా మూడు వేదములలోని పాఠములను నేర్పుచుండెను. ఆయన పాఠశాలలో వేదముల యొక్క షడంగములలోఁ గూడ మనమిప్పుడు చెప్పునట్టి కుర్చీలు కూడ నుండెను. తక్కిన వేదములను, వేదాంగములను గూర్చినవానికంటె శుక్లయజుర్వేదమును గూర్చిన యుపన్యాసములే యాజ్ఞవల్క్యుని శిష్యులందధిక సంఖ్యాకుల నాకర్షించెడివి. యాజ్ఞవల్క్యుడు మైత్రేయిని పరిణయంబాడిన తరువాత కొన్నియేండ్లకొకనాటి ప్రాతఃకాలమున దాదాపొక వందమందిశిష్యులుగల తరగతిలో యాజ్ఞవల్క్యుడు శుక్లయజుర్వేదమును బోధించుచుండగా నొక సంఘటనము సంభవించెను. దీనితరువాతి ప్రకరణములో చెప్పబోవు విషయ

ములతో దానికి సంబంధమున్నందున నిపుడది వివరింపబడ
వలయును.

ఇంచుమించుగ నొక యరఘంటసేపు యాజ్ఞవల్క్యు
డుపన్యసించునరికి పాఠశాలయొక్క సింహద్వారముకడనుండి
గంభీరమైన రథచక్రధ్వనివినవచ్చుటచేత నతడుకొంతవఱకు
కలంతనొందినవాడయ్యె. అటులాధ్వని వినవచ్చినతోడ్తో
డనే ద్వారపాలకుడేతెంచి నాల్గు గుఱ్ఱములంబూన్చిన గొప్ప
రథములో సేనాధిపతి యొక చక్కని చిన్నవానితోడం
గూడి చనుదెంచెనని తెల్పెను. ఈ సేనాధిపతి యెవరో కాదు.
మన పూర్వమిత్రుడగు యజ్ఞదత్తుడే. యాజ్ఞవల్క్యుని
ప్రాణసంరక్షణముఁ గావించిన క్షత్రియవీరు డిరుపురిలో
యజ్ఞదత్తుడొకడని చదువరుల కిదివఱకే తెలియును. యా
జ్ఞవల్క్యుని యాపదను తప్పించిన తరువాతి వత్సరములలో
యజ్ఞదత్తుడు తన సుగుణబాహుళ్యముచేతను, ప్రత్యేకముగా
యుద్ధనైపుణ్యము, శౌర్యపరాక్రమంబులచేతను రాజప్రీతికి
పాత్రుడై క్రమముగ నున్నత పదవుల నధిరోహించుచు నుత్త
రోత్తమమైనినోద్యోగమగు ముఖ్యసేనాధిపతిత్వమును ధనుపు
లగు రాజుగారివలన పొంది యాతని మహాసేనకు నాయకు
డయ్యెను. కాని యీ మహాసేనాధిపతి నేడినముదయకాల
మున నీవేదాధ్యాపకుని ద్వారముకడకుఁ గొనివచ్చినదేమి!

మిత్రులిరువురు కలసికొనినమీదట వారికి జరిగిన సంభాషణనుబట్టి మనమీవిషయమును గ్రహింతము.

యజ్ఞదత్తుడు:—" నా పూజ్యమిత్రమా! మీకర్తవ్యములలో మిమ్ముల కలతఁపెట్టుచున్నందుకు నాకు విచారముగ నున్నది. కాని మీపవిత్రకార్యముతో కొంత సంబంధము కలిగియున్నపనిమీదనే నేనువచ్చియున్నాను."

యాజ్ఞవల్క్యుడు:—" నే నీయభ్యంతరమునకు కించిత్తయినను చింతింపను. నినువోలు మిత్రుని దర్శించుటచే కలుగు మహదానందము మాటయటుండ పరిశుద్ధతేజ ప్రభావముతో ప్రకాశించు ముఖసందర్శనము చేయుటకు పవిత్రవేదమంత్రోచ్చారణను విరమించుటయును మాకు కడు సులభమైనదై యున్నది. కాని (సేనాధిపతివెంట వచ్చిన చిన్నవానియొక్క యసాధారణమయిన ఘనతను, చక్కదనమును కలిగియున్న ముఖమువైపు తిన్నగా చూచుచు) యిచట నీతోనున్న వీరెవరు?"

యజ్ఞదత్తుడు:—" ఇతనికొరకే నేను మీకడకువచ్చినది. ఈ యువకుని పేరు బ్రహ్మగుప్తుడు నాకు గౌరవనీయమిత్రుడగు ఇంద్రగుప్తుని కుమారుడు. ఇంద్రగుప్తుని పేరు ప్రతిష్ఠలను మీ రెరిగియే యుందురు. అతడు కాశీకాపురియందలి ప్రఖ్యాతవర్తకుడు.

రమారమిగా నా మహాసభ జరిగిన కాలములో రాజా జ్ఞలననుసరించి నేను వారణాసికి బోయియుంటిని. అప్పుడు ఇంద్రగుప్తునితో నాకు పరిచయము మాయెను. అప్పటినుండి యిప్పటికిని మేము తఱచుగా కలసికొనుచునేయుంటిమి. నా కుటుంబమునకు వారి కుటుంబమునకును మిక్కిలి స్నేహభావము కుదిరియున్నది. ఇప్పుడతని పెద్ద పుత్రుడగు బ్రహ్మగుప్తుని మన నగరములో నారక్షణ క్రింద విద్యాభ్యాసము చేయుటకై పంపి నన్ను విశేషముగ గౌరవించినాడు. ఇపుడీ బ్రహ్మగుప్తుని వయస్సు పదు నెన్మిదేండ్లు. వేదపఠనమునందితడిప్పటికే తలసినంత యభివృద్ధినొందియున్నాడు. కాని వేదాధ్యాపకుడను మీకీర్తి యితని తండ్రిని ప్రేరేపించి విద్యాపరిపూర్తి కొఱకితని నిటకు పంపునట్లు చేసినది. ఈ కుఱ్ఱడు మీ వసతిగృహములో నివసించి మీవలనను, మీ సహాయుల వలనను నేర్వగలిగినదంతయు నేర్చుకొనవలసియున్నాడు, మఱియు నితడు గౌరవనీయుడగు మానమిత్రుడు విష్ణుమిత్రునియొద్ద యుద్ధవిద్యల నభ్యసించుటకుకూడ తన కాలములో కొంతభాగమును వినియోగింపవలసియున్నాడు.

మానమిత్రుడగు విష్ణుమిత్రుడుకూడ యజ్ఞదత్తుని వలెనె రాజానుగ్రహముచే నిపుడున్నత పదవినధిరోహించి మిథిలాపురమునందలి రాజుగారి యుద్ధవిద్యాలయమున ప్రధానబోధకుడగు ధనుర్వేదాచార్యుడుగ నుండెనని పాటలిపుత్రము

తెలిసికొనవలయును. యజ్ఞదత్త, యాజ్ఞవల్క్యుల ప్రసంగము నిరాటంకముగ నిట్లు జరిగెను.

యాజ్ఞవల్క్యుడు:—" బ్రహ్మగుప్తుడు వైశ్యుడై యుండియు సాధారణముగ క్షత్రియులకు మాత్రము వనికి వచ్చునట్టివని తలంపబడు విద్యలయందలి రుచికలవాడై యున్నందుకు నేను బహు సంతోషము పొందుచున్నాను. నిజమైన వివేకమనగా మనసౌఖ్యము, రక్షణము, పోషణము నను వాని కావశ్యకమైనవంతయు మనము నేర్చుకొనుటయై యున్నది. కాని వృత్తిసంబంధమైన వ్యాపారజ్ఞానమును సంపాదించుటమాత్రముతో సరిపోదని నాయభిప్రాయము. కావుననే నా భావమరదియగు మైత్రేయుడు (సమీపమున నిలిచియున్న బలిష్ఠకాయుడగు నొక సుందరయువకునివంక జూచుచు) అగ్నిమిత్రుని కడకేగి సక్రమముగా పోవుచుండుటచే నేను సంతుష్టి నొందితినని ముఖ్యముగా భావింతును. (అగ్నిమిత్రుడు విశ్వామిత్రుని తమ్ముడు. ఇతడు రాజుగారి యుద్ధవిద్యాలయమున సాము-కసరత్తులను, దేహబలక్రియలను నేర్పు నుపాధ్యాయుడై యుండెను. మరియు తనంతట తాను కోరినవారికి విలువిద్యలను కూడ నేర్పుచుండువాడు.) మైత్రేయుడు నేర్చుకొనుచున్న యీ విద్యలతోడ నాతనికి తత్త్వమైనట్టి యుక్తులు తెలియవచ్చును. కాని యాతని

వ్యాయామములతనిని బలారోగ్యయుతుడగు పురుషుడుగా నెదుగునట్లు తోడ్పడుచున్నది. మీరతనిని కనిపెట్టియే యుందురు". (తిరిగి మైత్రేయునివంక నిష్కపటగర్వముతో చూచుచుండెను.)

యజ్ఞదత్తుడు:—"మైత్రేయునియొక్క శరీరవిషయిక శ్రద్ధనుగూర్చియు, మా పుత్రియు కళలనభ్యసించుట యందలి యాతురతను గూర్చియు వినుటకు నేనమితానందము నొందుచున్నాను. తండ్రి యింటియందును, విష్ణుమిత్రుని కుటుంబములోని వారగు యుద్ధవిద్యార్థిబృందముతోపలి మహోన్నతాశను కలుగజేయుగల, కొందఱు సుందరమూర్తులగు బాలకులతో కూడియుండగా విష్ణుమిత్రుని యింటియందును నేనుతఱచుగ మైత్రేయుని కలసికొనియుంటిని. కాని వేదాధ్యాపకునికొడుకు మరియొక వేదాధ్యాపకుని భావమరదితన యిష్టప్రకారమొక యోధుడుగా పరివర్ధమానుడగుచుండెనని యెవడెఱుంగును! (మైత్రేయునివంక జూచుచు చిఱునగవుతో ఏమందువు! మైత్రేయా"

మైత్రేయుడు:—(శ్లాఘనతో గూడిన ప్రియోక్తిని నగు మొగముతో వంగి నమస్కరించుటద్వారా స్వీకరించి) ఆర్యా! నా తండ్రి వృత్తినేకాని మఱియే యితరవృత్తిని నేనవలంబింపదలచలేదు. కాని నాశైశవకాలమున నేనువినిన యాకథపూర్ణ్యులగు నాగురువర్యులను తమ శ్రేష్ఠతయు, ధన

రాచార్యుడు కాపాడిన కథ నాకున్నలో కేవలము స్త్రీయులకే యాగర్భుడని యశ్రేయముగా భావింపబడు కళలు వారివారి 'యారోగ్యముకొఱకు, క్షేమముకొఱకు ప్రతివారును నేర్చుకొనుటవసరమను భావమును తీవ్రముగా ముద్రించెను. వీరా యిరువురి ఘనతలమూలమున గాకుండిన మా గుసువర్యుల స్థితి యేమయ్యేడిది ! మాతండ్రి సంగతి యేమి కావలసియుండెడిది.

యజ్ఞదత్తుడు:—" నీయుద్దేశ్యములను గూర్చి వినుట నాకాహ్లాదకరముగనున్నది బ్రహ్మగుప్తుని విషయమున యుద్ధకళాభ్యాస మావశ్యకముగనున్నది. పెద్దవాడయినపుడతడు తండ్రియొక్క యపారమూల్యముగల వర్తకపు సరకులవెంట పట్టణమునుండి పట్టణమునకు, దేశమునుండి దేశమునకు ప్రయాణముసాగించుచు, బందిపోటు దొంగలవారి నుండి వాణిజ్యవ్యాపారమును కాపాడునిమిత్తము విలుకాండ్రను, ఖడ్గధారులను తోడుగొని వారిని నడుపవలసినవాడుగా ప్రతీక్షింపబడుచున్నాడు. దారితోడుగావచ్చు నీవిలుకాండ్రును ఖడ్గధారులునునగు పురుషులు ముఖ్యముగ వింధ్యపర్వతప్రాంతముల నివసించువారు. వారలను జయించుటకొఱకతడు మహానిపుణుడగు యోధుడు కావలసియుండును. వారంత సాహసికులును, పట్టుదలతో పోరాడువారును నయియున్నారు.

విద్యాలయపు బహిర్ద్వార సమీపమునందున్న తోఁట మాత్రవలన సంభాషణ కాటంకము కలిగినది. పొద్దుటి పూట చదువు చాలించు సమయమాసన్నమైనదని తెలుపుచు కాగంట మ్రోఁగును. మిత్రులు తమ ప్రసంగమునాపి కొంచెము పనిచేయఁబోయిరి. యథోచితముగా బ్రహ్మగుప్తుఁడు విద్యార్థిగ చేర్చుకొనఁబడియెను. సేనాధిపతి యగు యజ్ఞదత్తుఁడు శయ్యా మున్నగు వసతులయొక్క యేర్పాటులను తొందర తొందరగా చూచి, విద్యార్థి విధాయకములతో నెంత తఱచుగ సందర్భపడిన నంత తఱచుగ తనయింటికి వచ్చుచుండవలసినదని బ్రహ్మగుప్తునకు తెలిపి పాఠశాలయందలి మిత్రులకడ సెలవుగొని తిరుగ తన వాహనమును చేరఁ బోయెను.

---

## షష్ఠ ప్రకరణము.

---

పంచమ ప్రకరణమునందుదహరింపబడిన కార్యములు జరిగిన పిమ్మట యేడేండ్లుగడచెను. అప్పటి బాలకులిప్పటికి పురుషులుగను, నప్పటి బాలికలిప్పటికి స్త్రీలుగను వృద్ధినొందినారు. యాజ్ఞవల్క్యుని వేదపాఠశాలయు, విష్ణుమిత్రుని యుద్ధకళాశాలయు, ప్రభువులను, మంత్రులను, న్యాయాధి

వత్తులను, సిపాయిలను, వృత్తులను నేర్చిన వారిని ప్రాంతము లోనికి పంపించినది. మైత్రేయుడప్పుడే వేదాధ్యాపకుడైన తండ్రికి సాయముచేయుచు నతని వలెనే పూజారిగా చేరొనుట కుద్యుక్తుడగుచుండెను. బ్రహ్మగుప్తుడు వేదాధ్యయనమును, యుద్ధకళాభ్యాసమును సంపూర్ణముచేసి తన తండ్రివృత్తిని స్వీకరింప జనకపురమును వీడి వారణాసిం జేరెను. కాని యే నగరమున తన జీవితమునందలి శ్రేష్ఠతమకాలముగడచెనో, యే నగరమున దీర్ఘకాలము తాను విడిచియుండలేని మిత్రులుకలరో, యానగరము మిథిలానగరమును సందర్శించుట కతడు ప్రతియవకాశమును వినియోగించువాడు. ముఖ్యముగా సేనానాయకుడైన యజ్ఞదత్తుని కుటుంబముతో బ్రహ్మగుప్తునికి గల సంబంధములత్యంత సన్నిహితములు. ఎల్లప్పుడు నతడు వారికి ప్రియమయిన యతిథియే.

యజ్ఞదత్తుడీ సమయమున తన ప్రియకుమారియగు గంగకు స్వయంవరమహోత్సవము (పెండ్లికూతురు పెండ్లికొడుకును వరించుట) చేయుటకు సిద్ధపడుచుండెను. ఇప్పు డామె కిరువదియేండ్లు వచ్చినవి. ఆమె యపూర్వసౌందర్యమునుగూర్చియు, నామె విద్యాబుద్ధులనుగూర్చియు, నామె పరిశుద్ధ ప్రవర్తనము, మధుర స్వభావములనుగూర్చియు విదేహరాష్ట్రమునందంతటనేగాక యాదేశపు సరిహద్దుల కవత

అమితముగ నామెకీర్తి వ్యాపించెను. మిథిలానగరమునందలి విద్యావిశారదుల ననేకులనామె మెఱుఁగును. వీరిలో నెవరి తయినను నామెకోరినచో వివాహమాడగలిగి యుండెను. ఎందరో రాజులును, రాజకుమారులును నామె పాణిగ్రహణ ముం గోరుచుండిరి. తక్కినవారిమాట చెప్పనక్కఱలేదు. అయిన రహస్యముగ తనమనస్సులో నెవనినయిన వరించి యుండకపోదు. కాని యాకన్యగాని యామె తండ్రిగారు గాని సాధారణమార్గమున నామె పరిణయమగుటకు సమ్మ తింపలేదు. ఉత్తమ క్షత్రియజాతియొక్క ప్రాచీన శాస్త్రీ యాచారపద్ధతి నామెపెండ్లి జరుగవలయును. మహావైభవ ముగా స్వయంవరమహోత్సవము నడువవలయును. ఆ స్వయంవరమునకొక పందెముండవలయును. సగర్వముగా బలపరాక్రమ ప్రదర్శకమగు నద్భుతకార్యము నొనర్చిన వీరుడు మగడే మనోహారిణియగు నీకన్యకామణి కధిపుడు కాగలడు, అనునదే యాపందెము. ఈ విషయములో తండ్రి కూతురు సంపూర్ణముగ నేకాభిప్రాయులై యుండిరి. తత్పాత్ర స్వభావవిధేయులును, ధీరులును, సహకాంతులునగు బాంధ వులెల్లరు నిందుకు చేయూతనిచ్చిరి. ఇట్లు నిశ్చయింపబడిన స్వయంవరమునకువలయు సన్నాహములు ప్రాచీన భారతదే శమున పేరెన్నికగన్న క్షత్రియ సేనావాహినులలో నొకటి యగు మహాసేన కధిపతియగునాయకుని కీర్తి నున్నతస్థితికిం

తగినరీతిగా బహుదివ్యముగ చేయబడినది. [illegible]
క్షుద్రరాజులతో సహా సకలసంస్థానాధీశ్వరులకు, కళానిధులకు
విద్వాంసులకు, సమర్థులగు రాజనీతికోవిదులకు మున్నత సైని
కోద్యోగులకు మంత్రులగు వర్తకులకు వీరలందరకు నాహ్వాన
పత్రికలంపబడినవి. జనకరాజ్యమునందంతటను ఢంకానినద
ముతో సాధారణ ప్రకటనముచేసి చాటింపబడినది. ఈ విధ
ముగా కులమును, గోత్రమును విచారింపక పందెమును
గెల్చినవానికెవ్వనికయినను గంగాదేవిని నిచ్చివేయుదుమని
యెల్లరకు నెరిగించిరి. కులగోత్రవిమర్శనము స్వారిచేయు
నాదినములలో నుత్తమక్షత్రియులెల్లు బహిరంగ స్వయంవర
మున తమకూతుండ్రను తక్కువతరగతి పురుషులకు సైతము
సమర్పించుట కియ్యకొనువంత యెక్కువగా స్త్రీయగౌరవ
స్థితిని మఱువగల్గెడివారో యాశ్చర్యముగనుండును. కాని
నిజముగా ప్రాచీనకాలపు క్షత్రియులు మహోదారులును,
స్వతంత్రముగ యోచింపగలవారును నభివృద్ధినొందువారును
నైయుండిరి. అంతియేగాక మనముచదివెడు స్వయంవర
విధానములయొక్క యుద్దేశమునందు కొంతవరకు గూఢమైన
తత్త్వజ్ఞాన సంబంధముకూడను గోచరించును. ఈ స్వయం
వరముకొర కొడ్డినపందెము చాలదుస్తరమైనది. నిర్దిష్టమైన
పరాక్రమ ప్రదర్శనము. దేశములోని మహాయోధా
రులందరు కేవలము [illegible]

[illegible] సాధ్యమగునట్టిది. అట్టిపురుషుడు తక్కువజాతికి చెందినవారయినను, అర్థతః వారు క్షత్రియులే—గుణ, కర్మల ననుసరించి వారు క్షత్రియత్వము నొందినవారే. అట్టివారికి భార్యలైనందున క్షత్రియకన్యక లేవిధముచేతను హీనస్థితిని పొందరు. ఈరీతిగా హేతువాదము చేసి ప్రాచీనయోధులు స్వయంవరములు జరిపించియుండినట్లుతోచును. యజ్ఞదత్తుని విద్యావివేకములతని వీరత్వమునకు యుద్ధకౌశలమునకు తీసిపోవునవికావందున నతడును బహుశా యిట్లే హేతువాదము చేసియుండును.

జనకపురినుండి గంగానదికిదిగువగా పదిమైళ్ళదూరములో నిర్మింపబడిన యజ్ఞదత్తునిగృహములో స్వయంవరము జరుగవలసియుండెను. పట్టణమునకు దూరముగనున్న యా గృహమునకు దాపుననొక బహిరంగభూభాగమున నుత్సవమునకురానున్న మహాజనసమూహము కూర్చుండుటకొక రంగస్థలము నిర్మాణమయినది.

గురిచూచికొట్టుటకు చిహ్నముగా మెల్లగా చుట్టిచుట్టి తిరుగుచుండు కొయ్యనెమలి నేర్పరచిపొడుగైన స్తంభములమీదనమర్చి యా కాళ్వారము (స్తంభములమీదికి దూర్చి నహొప్పు) నందొక చివరనుంచిరి. నాల్గుమైళ్ళ మార్గములు నగరి వృత్తముగ రచియింపబడియున్న యా గొప్పకట్టడముపై

నానావర్ణములతో చిత్రితమైన మేలుకట్లు కట్టబడియెను.
ఈ రంగస్థలముచుట్టును నతిథుల సౌకర్యార్థము వివిధపరిమా
ణములతోడి నానారకముల గుడారములు లెక్కకు మిక్కు
లిగాపాతబడి యా ప్రదేశమంతయు శిబిరనగరమువలెను,
దండెత్తివచ్చిన మహాసైన్యము బసచేసిన స్థానమువలెను కన్ప
ట్టునట్లు చేసినవి. స్థిరీకరింపబడినట్టి దినమున సుదయమునుం
డియు నుత్సవము ప్రారంభము కావలసియుండెను. కాని
దూరదేశములనుండి యతిథులు స్థిరీకరింపబడిన దినమున
కంటె చాలదినములు ముందుగనే రాసాగిరి. వచ్చినవారొ
క్కొకరును తమకీయబడిన గుడారములలో వసించుచుండిరి.
జనకపురియతిథు లుత్సవదినమున కేవలిదినమున మధ్యాహ్నా
త్పరము వచ్చిచేరిరి. యువకులు ముఖ్యముగా జాగరూకులై
మర్యాదకు లోపముకలుగకుండ వీలైనంత పెంగలకద నా
స్థలమునకు పోవుటకాతురులైయుండిరి. అచటికి త్వరగ
వెళ్లుటకు ప్రేరేపకహేతువు మరియొకటికూడ నుండెను.
అచోట పక్షులును, నానాజాతుల మృగములును కొల్లలుగ
నుండి మేలైనవేటలాడ వీలుండెను. మనకిప్పుడు కానుకలో
నున్న శ్రేష్ఠమగు డాలమవస్తువును యువకుల బాణముల
కొరకు సిద్ధపరచినట్టివారును గతకాలమున ననేకములయిన
పావనక్రతు, యజ్ఞములను పాడుచేసి యెందరనో యాత్మ్యా
అనుచరింపి తొత్తుకొనిపోయినట్టివారునునగు నాడివు నివాసు

లంబిత ప్రజలు నివసించునట్టి చిన్న చిన్న పల్లెలున్నాయి దగ్గర దగ్గరగా లేకపోయిన యటవీ చిట్టిగొండలలో నక్కడక్కడ నుండెను. ఇరుదుసైతము దేశమువందనేక భాగములందా ర్యనివాసగ్రామములును నాగరికప్రజల దోపిడికి పాల్పడి యున్నది. కాని మహానగరమగు మిథిలయొక్క సామీ ప్యతయు ప్రబలుడగు రాజను జనకుని కీర్తియు నీకొండజనులను బెదరించివారార్య రక్తముయొక్క రుచిని, యార్యధనము యొక్క సుఖానుభవమును మఱచిపోవునట్లు చేసివైచెను. స్పష్టముగ తెలియుచున్నవారి సాధుత్వమునకు బదులుగ జన కుడు తనరాజ్యములో నచటకనుబడినను నట్టివారికి కొండల లోనివారి యాశ్రయములలో నిశ్చింతగనుండుటకును, వారి యాటవిక స్వభావానుసారముగ వేట, చేపలంబట్టుట యను పనులను నెమ్మదిలో చేసికొనుటకును నవకాశమిచ్చియుండెను. కాబట్టి యజ్ఞదత్తుని భవనమునకు గొనితేగవచ్చినట్టి వేట తమకముగల యువకులు స్వయంవరదినమున కేవలిదినము సాయంసమయమున తాము వధింపనెంచిన మృగములలో నా యాటవికులనుకూడ చేర్చుటకు తలపడలేదు.

కాని యదృష్టము మరియొకతీరున విధించినదని మనము క్రమముగ కనుగొందుము. అప్పుడేవచ్చినట్టి మిథి లానగరవాసులు గుంపులుగుంపులుగా. [illegible]

బడిన ప్రతియోగ్యులను వింతగచూచుచు తిలకించుచు రొక్క చుట్టుపట్టుల ప్రదేశమునందలి ప్రకృతిసౌందర్యమును ఆనందించుచు స్వయంవరభూమి యందటు నిటు తిరుగు చుండిరి. గంగాసుందరి కరగ్రహణమును కోరువారితో సహా కొందరు యువకులగు విలుకాండ్రు చిన్నదగు నాక కొండచెంత పిట్టలను వేటాడుచుండిరి. రేపు పొద్దుట తమ చేతిని ప్రయోగింపవలసిన దుస్తరకార్యముకొరకు వారు తమంతటతాము విస్పష్టముగా సంసిద్ధులగుచుండిరి. గంగ కరమున కాసింపనివాడైనను మైత్రేయుడీ గుమితోనుండెను. అతను తనధనుస్సును తెచ్చెను. ఒకటి, రెండు పిట్టలఁ గొట్టెను. కానియతనిమనస్సు వేటయందు లేదనుట తెల్లము. అతడు క్రమక్రమముగా తనచెలికాండ్రను వీడి యేయుద్దేశ ములేకుండ దూరమునకు నడచిపోయెను. అతడు స్వయంవ రమునుగూర్చి తలపోయుచుండెను. అయ్యది మరుదినము జరుగబోవునదిగాక దానిజాడననుసరించి యేనాటో కొంక నాడు జరుగనై యున్న స్వయంవరము. అది విష్ణుమిత్రుని కూతురును, విద్యావిశారదయు, సౌందర్యవిలసితయు నగు సరస్వతియొక్క సంభావ్యమైన స్వయంవరము. ఆస్వయం వరోత్సవమిపుడు కేవలము సంభావ్యమాత్రమే. ఐనప్పు టికిని దానినిగూర్చిన తలంపాయువకుని గుండె వేగముగ

గొట్టుకొనునట్లు చేసెను. ఎట్టనిదగు వానివిముఖమునందుండ కత్తి మును తలచివేసెను. సరస్వతికన్యాకరగ్రహణమును తాన శింపలేనని యాతడెఱుంగును. అతడు నేర్పుకాడగు విలు కాడయుండుటకు సందియము లేదు. కాని బహుజాగ్రత్తగా శిక్షనొందినట్టి ధనుర్వేదాచార్యుని శిష్యులతో తానేవిధము నగాని సమానుడనని యాతడనుకొనలేదు. అంతేగాక స్వయంవరము కులమును, పదవిని లెక్కచేయక సర్వులకు ప్రవేశాధికారమిచ్చునదై యుండినను వేదాధ్యాయకుని కొడుకు క్షత్రియకన్యకకొఱకు విలువిద్యయే వృత్తిగాగల ధనుర్ధరులతో పోటిచేయుటయను నభిప్రాయము జనసమ్మతమైనదిగ నుండలేదు. అతని తండ్రియగు మిత్రుడు క్షత్రియకన్యకను ముఖ్యముగా నతని ప్రియమిత్రుడగు విష్ణుమిత్రుని కొమరితను సాధారణమార్గమున నతనికొడుకునకు పెండ్లిచేసినచో నామెను కోడలుగ స్వీకరించుట కభ్యంతరములేనివాడై నప్పటికి నట్టి పోటిపరీక్షకు పోవ సమ్మతించునని యాతడెంత మాత్రము నెదురుచూడజాలడు. ఈతలంపులు మైత్రేయుని విచారగ్రస్తుని చేసివైచినవి. ఇన్నిసంవత్సరములనుండి హృదయమను సమున్నతపీఠముపై నుంచి పూజించుచుండిన యా దేవతను మెల్లగా క్రిందికి దించుట యవసరమని వివేకము బలవంతపెట్టసాగెను. [illegible] చింతాక్రాంతుడై యున్నతఱి [illegible] చూచెను! అదిగో పూజారిణి

వస్త్రవేదో యుండెనే. తీవ్రములగు నాతని కాంక్షలయొక్క-
యింద్రజాలమువలన యక్షిణీవిద్య చేయబడినదా యున్నట్లు
యుండెను. తనయీడుబాలికలు కొందఱితో కలసి సరస్వతి
యచటి సుందర సృష్టిసందర్శనముచేసి యానందించుచు
నటునిటు నడయాడుచుండెను. ఆమె మైత్రేయుని చూచినదో
లేదో కాని యడవిపూవులతో నిండియుండిన పొదయొకటి
తత్క్షణమే యామెశ్రద్ధ నాకర్షింపగా సఖులనెల్లను విడిచి
యా వైపునకేగినది. పువ్వులనేరుకొనుటయందలి సంతోష
మామెను క్రమక్రమముగా దూరదూరమునకు గొంపోయి
తుదకొక యున్నతభూమి యామె చెలికత్తెలకామె కనబడ
కుండ మఱుగుపడుటకు తోడ్పడునట్లుచేసెను. ఇంకొక
ప్రక్కను మైత్రేయుడు పిట్టల వేటకాండ్రను వదలి మృదు
వుగా దాదవ్వునకు నడచిపోవుచు నామెతో కుశలప్రశ్నచేయు
టకుగాని, మాటలాడుటకుగాని మనస్సులో నుద్దేశములేనప్ప
టికిని హృదయాధిదేవతయగు సరస్వతి సమీపమున కీడ్వ
బడుచుండెను. ఇంతలో నాకస్మికముగ నాకన్యామణి
కెవ్వునకేకవేసెను. ఆకేక భయోత్పాదకమైయుం
డెను. మైత్రేయుడు తలనెత్తి (ఇంతవఱకు నాతడు నేల
రముగ చూచుచుండె. [illegible]యుండెను) యామె వై
పుమను, ఘోరాకారుడును నగు నొక కొండవానిచే గట్టిగ

బట్టుకొనబడి కొంతదూరములో గోచరించుచున్న గట్లవరుస పై పురుషు డీడ్చికొనిపోబడుచుండుటను చూచెను. వెంటనే యతడా రాక్షసుని వెన్నాడి క్రోధముతో కేకలువేయుచు పరుగెత్తుచు గుఱిచూచికొట్టుటకు యత్నించుచుండెను. కాని కృతకార్యుడు కాలేదు. అటవికుని పడగొట్టుటకును, నాతని గమనము నరికట్టుటకును ప్రయోగింపబడు బాణము వాని చేరదైయున్న కన్యను గాయపఱచవచ్చును, లేదా చంపి వేయవచ్చును. కావున వానిని వెంబడించు మైత్రేయున కొక్కటే మార్గముకలదు. కొండవాని నడకవేగమును మించిన నడకవేగముతోపోయి వానింబట్టవలయును. ఇందు కతడు యావచ్ఛక్తిని వినియోగించి ప్రయత్నములం జేయుచుండెను. ఇటులుండ నాయనాగరికుడు తనపట్టు విడిపించుకొనుటకై ప్రయాసపడుచు, పెనఁగులాడుచున్న అబలయగు నాయువతీలలామను కదలలేని మెదలలేని దానిం జేయు నిమిత్తము తటాలున భుజములమీద నెత్తుకొని మడతపెట్టినట్టి తనమెడచుట్టు బదలైచి యామె చేతులను, పాదములను తన రెండు హస్తములతో బిగించిపట్టుకొనెను. మైత్రేయుడిది చూచి ధైర్యమువహించి శత్రుశరీరమున కధోభాగమున గుఱిచూచి సంధించిన శరముం బ్రయోగించెను. అనారత వ్యాయామవాకృతిని చిట్టచివర గ్రంధిన కండ్లగలుగల కాటి కిష్కుడుకలె నేలఁగూలఁబడెను. వాని సాగ పైన చేరబిగి పడ

అగా తప్పువదల్చుకొని క్రిందపడి ప్రాణదాత నై తృనాల పడుగు వాలెను. తనంతటతానుపోయి దాగబడిన తామరపువ్వులపై బడి యాగోమలి వేటకానిచే కొట్టబడిన పావురమువలె గజగజ వడఁకసాగెను. కాని తానతనిచే నెంతగా బాధింపబడుచుండెనో అంతయెక్కువగా తానవని వక్షమును వాంఛించుచుండినదో అట్టి ప్రియుని మృదుల, మనోహర సంస్పర్శ మామెకు వశమవకారిణై వర్తించినందున శీఘ్రముగ స్వస్థత జెంది పూర్వస్థితికి వచ్చెను. పిట్టల వేటాడుచుండిన మైత్రేయుని చెలికాండ్రు సరస్వతి కేకలచేతను, మైత్రేయుని యలుపులచేతను నాకర్షింపబడి యిప్పటికి వారిం జేరినారు. వీరి తరువాత సరస్వతి సఖిమణులుపోయి భయపెట్టుటచేత కదలికనొంది శిబిరమునుండి బైలుదేరిన విస్తారసంఖ్యాకులగు నితర జనులు వచ్చిచేరిరి. ఈ గుంపులు నిలిచిన చోటికి కొంచెము దూరమున రక్తప్రవాహములోఁబడి పొర్లుచు నాటవికుడు పడియుండెను. ఒక్క చూపుతోడ నవస్థయెట్టిదో యెల్లరును గ్రహించిరి. రక్కసునితో తాను తారసిల్లిన సమాచారమంతయు మైత్రేయుడు తెలుపకముందే సంగతి వారికి విదితమైనది. ఆరాక్షసుని చూచినతోడనే సాయుధులగు యువకులు కొందఱు వానికడకు పరుగిడిరి. వారిలో ముందు పోయినవాడు తనఖడ్గముతో నొక్క వ్రేటు వేసి వానిం జంపెను. [illegible]

మాత్రమేకాదు. ఆయదృష్ట హీనజాతికి చెందిన జనులొక గట్టు చివర కారుతీరి యెదుటఁగన్పట్టిరి. వారు తమ చేష్టల ద్వారా తమ యభిప్రాయము స్నేహభావమునకు చాల దూరముగనున్నట్లు తెలియబఱచి యాకావున గుమిగూడియుండిన కోపోద్దీపితులగు క్షత్రియులనుండి శరపరంపరల నాహ్వానించి కేవలము బాణమేఘాచ్ఛన్నులై పోయిరి అమ్ములమోఘముగ పనిచేయుటచే కాలవ్ణకాయులయొక్క దీర్ఘపంక్తిలో మొదటిసారి కురిసిన బాణవర్షపాతానంతర మిద్దరు, ముగ్గురు మాత్రమె గోచరించిరి. ఇయ్యది సైతమాజగడగొండి యువకులయొక్క మహోగ్రక్రోధానలజ్వాలను శమింప జేయదయ్యె. దూరముగనున్న పర్వతపంక్తిపై తెల్లనిమాసికలమాదిరిగా గన్పట్టుచున్న చిన్న చిన్న పల్లెలు హానికిని, దురాలోచనకును నాశ్రయములని శంకించి యాగ్రామములను ముట్టడింప నిశ్చయించి వేగముతో ముందుకుపోసాగిరి. కాని కొన్నియడుగులు వేయునంతలో ఆగు ఆగు అనుకేకలు వినఁబడి వారిగమనమును నిరోధించెను. బలీయమైన సైనిక దళముతో స్వయముగా సేనాధిపతియే యేతెంచినాడు. ఆయన క్షత్రియ యువకులను సంబోధించి యిట్లు వచించెను. "ఓ నాచిన్నమిత్రులారా! నాకొఱకు మీప్రయత్నము మానుడని నేను మిమ్ము వేడుచున్నాను. మనము క్షత్రియులము. అవశ్యకమైనపుడు రక్తపాతముచేయుటకు వెనుకాడరాదు.

కాని యదిగో దూరమున గోచరించుచున్న గ్రామములు మన కెట్టి కీడును చేయుటలేదు. ఒక దౌర్భాగ్యుని దౌర్జన్యమున కలిగిన ప్రాణము తీయబడి ప్రతిచేయబడినది. అది కేవలమా తని స్వకీయమైన బుద్ధిహీనతకు ఫలితము కానోపును. అతని యందు సానుభూతి నగపఱచినవారు కొందఱు కూడ నొక విధముగా యుక్తమరణమునకే పాల్పడిరి. కాన పవిత్రమగు నుత్సవము ముందటి సాయంతనమున మనమిక నెక్కువ రక్త పాతము చేయవద్దు. నేనిచట బలవత్తరమైన కావలిగా నీ సిపాయిలనుంచెదను. వారీరాత్రియంతయును, రేపుపగలంత యును నిందేయుండి చెఱుపుచేయు దుష్టులెవరును స్వయంవర ప్రదేశమును సమీపింపకుండగా పాడెదరు. ఈముందు జాగ్ర తచాలునని నానమ్మిక. జరిగినదానికై మనము విచారపడ నక్కఱలేదు. ఒకస్వయంవరమింకొక స్వయంవరమునకు ముందు జరుగుట యెక్కువ శుభకరము'' ఈమాటలననుచు సేనానాయకుడు మైత్రేయి నివంకను, నతనిచుట్టునున్న యువ కులవంకను మందహాసముతో చూచెను. వారుకూడ సేనా నాయకునివంక జూచి పిమ్మట నొకరినొకరు చూచుచు కొని నవ్వుకొనిరి. సేనాధిపతి పెద్దవాడైనను సతని హృదయ మింకను యౌవనముకలదై తమ హృదయములతో సంబం ధము కలిగియున్నదని వారు గ్రహించిరి. ఒకొక్కరి హృద యములోపల నేదియనుకొనబడుచుండెనో సరిగ దానినే సేనా

ధివరించెను. సరస్వతీదేవి తనస్వయంవరమును ముందుగ జేసుకొనెను.

పైన వివరింపబడిన విధమున ప్రత్యేకముగ స్వయంవరము జరిగిన పిమ్మట వేరొకస్వయంవరమెద్దియు నెవ్వరిచేతను నామ కొఱకు ద్దేశింపబడలేదు. కాని నేనిపుడు గంగా స్వయంవర వర్ణనమునకుఁగడంగవలయును.

స్వయంవరమహోత్సవమునకు నిర్ణీతదినమగు మఱుదినము మానసోల్లాసకరములగు శ్రావ్యసంగీతవాద్య విశేషములతోడను, బాకా, భేరీ తూర్యనినాదములతోడను తెల్లవాఱినది. ఉత్సాహకరము నాహ్లాదకరమునగు వేడుకంజూడ కుతూహలాయత్తచిత్తులై యున్న క్షత్రియుల హృదయములు సంతోషముతో నుప్పొంగినవి. గతరాత్రి శిబిరములో నెవ్వరికిని, నిదురగాని లేదనవచ్చును. నగరమునుండి క్రిందటి దినము రానివారగు ప్రజలు తెల్లవాఱకముందు చాల సేపటినుండియు తండోపతండములుగ రామొదలిడిరి. ప్రభాతమై యొకగంటయైనఁగాక పూర్వమే బ్రహ్మాండమైన విశాల స్వయంవరరంగము జనులతో క్రిక్కిరిసిపోయినది. అదృశ్యము శోభాయమానమై, మహదానందసమేతమై యాది వఱకు జరిగిన వేడుకలనన్నిటిని మించియుండెను. తాత్కాల ముచే చుట్టుకొనబడిన విశాలప్రదేశమునందొక కొనయందు

క్రొత్తగా స్థాపితమైన సింహాసనముపై విదేహరాజ్యాధిపతి యగు జనకమహారాజాసీనుడై యుండ మంత్రులు, సాలోచనాసభవారు నాయనను పరివేష్టించి యుపవిష్టులై యుండిరి. రాజుగారికెదురుగా బహిరంగభూమియొక్క రెండవకొన యందు పోటీచేయువారు నిల్చుండుట కొఱకొక నెత్తిన్నె యమర్పబడెను. ఆతిన్నెకు దాపుగ లక్ష్యము—చాల పొడుగైన స్తంభముయొక్క తుట్టతుదను సాధారణయంత్రములద్వారా నెమ్మదిగా చుట్టితిరుగుచుండు కొయ్యనెమలియమర్పబడెను. ఆకృత్రిమమయూర నేత్రములయందొక నేత్రము లక్ష్యస్థానముగ నిరూపితమైనది. ఉపవేశనార్థము నిర్మితమైనట్టి యాసన విశేషమునందలి పైభాగములో నగ్రాంశము సేనాధిపతి యాహ్వానముపై పోటీచేయు ప్రత్యర్థులుగను, నూరకచూచు ప్రేక్షకులుగను వచ్చియుండిన బహుళ సంఖ్యాకులగు విదేశప్రభువులచేతను, రాజకుమారులచేతను నాక్రాంతమయ్యెను. తక్కిన యర్థభాగము నారీమణులచే నాక్రమింపబడినది. ఆస్త్రీరత్నముల నడుమచుక్కలలోని చంద్రునిభంగి నంతమంది హృదయములలోని వాంఛకులక్ష్యమై విలసిల్లెడు కన్యకామణి ప్రకాశించుచుండెను. వనితామణులును, ప్రభువులును ధరించియున్న రంగురంగుల దివ్యాంబరములయొక్కయు ప్రభువులయొద్ద తళతళలాడెడు నాయుధములయొక్కయు కాంతిధారాధళ్యముదయించుచున్న సూర్యుని తేజముతో ప్రతి

స్పర్థ చేయుచున్నట్లు కన్పట్టెను. ఆయాసనమునందలి మిగత భాగములు జనకరాజ్యమున కావలనున్న చేరువరాష్ట్రములనుండియు, దూరరాష్ట్రములనుండియు, జనకుని పరిపాలనలో నున్న సకలప్రదేశములనుండియు నాగతులై సంఘములోని సర్వవర్ణములకు, సర్వశ్రేణులకు చెందియున్న మహాజన సమూహముతో నిండిపోయినవి. బాకాతుత్తారాలు దిక్కులుపిక్కటిల్లునట్లు కమాలుగామ్రోయుత్సవప్రారంభసమయ ప్రకటనముంగావించెను. సైన్యసంబంధిక సంగీతముముగిసి, దాని కంటెను కోమలమును, పావనమును నగు హోతలు, అధ్వర్యులు, ఉద్గాతృలనబడు పురోహితబృందముయొక్క గానమారంభమాయెను. వీరలు ఋగ్వేదమంత్రములను, యజుర్వేదమంత్రములను, సామవేదమంత్రములను వరుసగ పాడుచుండిరి. పిమ్మట రాజాజ్ఞచే దూతలేచి నిలచి కన్యకయొక్క తండ్రిపక్షమున స్వయంవరోపయోగమును, దానితత్త్వమును తెలియజేయుచు గిరగిరతిరిగెడు కొయ్యచేపలి కండ్లలో నొకదానింగొట్టుటలో జయముగాంచిన పురుషుడు బ్రాహ్మణుడుగాని, క్షత్రియుడుగాని, వైశ్యుడుగాని శూద్రుడుగాని యెవ్వాడైనను నతనిని గంగాదేవి భర్తగావరించునని చాటి చెప్పెను. ప్రకటనానంతరము సభ స్తబ్ధమైపోపట్టె. పందెము మిక్కిలి యసాధ్యమైనదిగదోచె. మహాప్రవీణులగు విలుకాండ్రుకూడ వెనుక ముందులరయుచున్నట్లు కన్పట్టిరి. పై

భాగమున తానాసీనుడై యుండిన తావునుండి లేచి గొప్పతన
మును తెలుపునట్టి మందగమనముతో క్రిందికిదిగివచ్చు నొకా
నొక ప్రభువుయొక్క యస్త్రీ స్త్రీగణగంధర్వములవలన నిశ్శ
బ్దతదూరీకృతమై యందఱిచూపులు నారాజుమీదనే నిలువ
బడి సమగ్రజనసమూహములో, విమర్శనము, నిరీక్షణము
ప్రవర్తిల్లెను. ఆపోటచేయవచ్చిన పురుషునిపేరు, కులము
తెలుపబడలేదు. మకుటయుక్తమగు మస్తకము మాత్రమతి
దొకరాష్ట్రాధిపుడను సంగతి నెఱిగించుచుండెను. స్వయంవ
రప్రతిజ్ఞయందు స్పర్ధులను పంక్తిగొమటిలకుగాని, సభికులకు
గాని నెఱుకపఱచుటాచారమైయుండలేదు. పందెమునొద్ద
కుండ జరుపు స్వయంవరములలో మాత్రమట్లు పరిచయ పఱ
చుట వాడుకలోనుండెను. కాబట్టి దూరిస్వయముగ వదలి
పెట్టిన పనిని నేనునుచేయును. స్పర్ధలలోవిజేత గోచరించు
వఱకు తక్కుంగలవారి నెల్లతని నపరిచితులుగనేయుండనిందు.
వేడుకపోట్లాటవంటియీపోటికి దారితీసిన రాజుగారపజయము
నొందినారని చెప్పనక్కఱలేదు. అతని తఱువాతి పందొమ్మి
దిమంది యుట్లేయపజయము నొందిరి. ఇందుకొందఱురాజులు,
రాకొమరులతోగూడ సైనికోద్యోగులు, సేనలోనిసిపాయిలు,
ధనుర్విద్యాగురువులగు బ్రాహ్మణులు, క్షత్రియులు, కొలది
మంది శూద్రజాతి ప్రభువులు, శూద్రయోధులునుండిరి.
మొదటి యిరువదిమంది స్పర్ధులు నపజయము నొందినమీదట

ములుల కొంతసేపు నిశ్శబ్దమయ్యెను. వింతతీవీరులైనారు. తరువాత జనకపురి ధనుర్వేదాచార్యుడగు విశ్వామిత్రుడు తన శిష్యులకు చిన్నని మార్గముచూపునిమిత్తము తెచ్చెను. అతని శిష్యులలో పదిమంది యతనిపాదములకడఁగూర్చుండి తామా కఠోరకార్యమును సాధింపబోవునపుడు తమప్రక్కననిలిచి యుత్సాహోపదేశముల ననుగ్రహింపుచుండవలెనని బలవంత పెట్టుటచేత విశ్వామిత్రుడందులకియ్యకొనెను. కర్తవ్యనిష్ఠ, యభిరుచి రెండును నాతనినట్లంగీకరింప ప్రేరేపించినవి. తన శిష్యుడొకవేళ కృతకార్యుడాయెనా వానికీర్తియందొక భాగము తనదియగుంగదా! కావున నొక్కరొక్కరుగా యువకులు లేచి గురునిప్రాంలనిలచి తమయమ్ములను విసురుటకు పూర్వమాయాచార్యుని యుపదేశముల నాలకించుచుండిరి. అతని యుపదేశస్వరూపమిట్లుండెను. "పక్షిపై మీదృష్టి నిల్పుడు. తక్కిన దృశ్యము మీకగోచరమగునట్లు చూడుడు. గుండ్రముగా తిరుగుటలో పక్షినేత్రములు మీవైపునకు వచ్చుటకెంత సమయముపట్టునో బాణముపోయి దానిందాకుటకెంతసమయముపట్టునో సరిచూచుకొనుడు. కొట్టదలచిన కన్ను మీయెదుటికిరాగనే నారాచముపోయినాటునట్లుగా మనస్సులో కాలవ్యవధిని సవరించుకొని యాకన్ను మీకు గోచరముకాక పూర్వమే మీయమ్ములంపుడు. ఎప్పుడు కొట్టవలయునో సంశయింపరాదు. అట్లుచేయుట యభ్యాస

మగును. తగినక్షణమున మీయంతట మీరే గ్రహింప వలయు.''

ఇట్టి సంగ్రహోపదేశము చేయబడినప్పటికిని నీబట్టులో తొమ్మిదిమంది పరాజయముగొందిరి. వీరియందొక్కరుడు బ్రాహ్మణుడు. ఏడుగురు రాచవారు. ఒకరుడు వైశ్యుడు. ఇందు కొందఱు లక్ష్యమునకు చాలదగ్గరగాపోయిరి. వారి శరములు లక్ష్యస్థానమునంటుచు పైపైనతగులుచు పడగలి దెగిపోయినవి. ఆటుపిమ్మట నాబట్టులో చివరివాడు, ఘటిల్లిన ప్రతికారము జయముగాంచినవాడు నగు వ్యక్తి లేచెను. అతడు మనమిత్రుడైన బ్రహ్మగుప్తుడే, కాని మఱియొకడు కాడు స్వయంవర ప్రకటనమాతనిని కాశికాపురినుండి జనకపురికింగొనివచ్చినదని చెప్పకుండనే పాఠకులూహించుకొని యుండవచ్చును. విదేహ రాజధానిలో నతడుసుపరిచితుడు. అతని విలువిద్యానైపుణ్యమెల్లవారికి విదితమే. విద్యార్థిదశయందనేకమైన వేడుకకయ్యములలో నతడు తన ప్రత్యేకత నగపఱచియున్నని బహుమానములందుకొనియుండెను. తండ్రిగారి పనిని స్వీకరించినప్పటినుండియు నతని మహైశ్వర్యమునుగూర్చియు, దాతృత్వమునుగూర్చియుకూడ నధిక సంఖ్యాకులెఱిగియున్నారు. జనకపురమున నతని నెఱిగియున్న వారెల్లరు నతనియందత్యంత గౌరవభావము కలిగియుండిరి.

ఆకారణముచేత వతడు ధనుస్సుచేకొని లక్ష్యము ముందట నిలువగనే యెల్లరిచూపులు నాతనిమీదనే నిలిచినవి. భావనలు చాలదూరము పర్వులిడినవి. బ్రహ్మగుప్తుడు తప్పక జయించునని యనేకమంది తలంచిరి. అతనిగురువు "వత్సా! లక్ష్యము మీదనే మనస్సు కేంద్రీకృతముకాక పూర్వము శరమును విడువకుము." అని చెప్పెను. అందఱును నిశ్శబ్దముగనుండ కొన్ని నిమేషములు గడచిన పిదప గురువాచిన్నవాని నిట్లుప్రశ్నించెను. "ఇపుడు నీవేమిచూచుచున్నావో నాకు చెప్పుము ?"

"నేను కేవలము పక్షినేచూచుచున్నాను. ఈప్రేక్షకులు నాకనుల కదృశ్యులై యున్నారు." అని బ్రహ్మగుప్తుడు బదులుపలికెను. అపుడు గురువు,

"మంచిది. ఇంకను బాణమువేయవద్దు. రవంతసేపాగుము." అనివచించెను. మఱల కొంతసేపు నిశ్శబ్దముగ గడచిన వెనుక గురువు "ఇపుడేమి చూచుచున్నావు ?" అని పృచ్ఛచేసెను. "నావైపునకు, నవతలివైపునకు తిరుగుచున్న పక్షినేత్రములను మాత్రమే నేనుచూచుచున్నాను." అని బ్రహ్మగుప్తుడుత్తరమిచ్చెను.

"సరే. కొలతలుగ్రహించి యుక్తక్షణమునందస్త్రము బ్రయోగింపుము." అని గురుడు తిరిగివచించెను, మాటి

కొన్ని నిమిషములు గడచినవి. బ్రహ్మగుప్తుడు తన శిలీంద్రిమును ప్రయోగము చేసెను. ఆబాణము నెమలియొక్క మెడమకంటిలోదూరి కుడికంటిగుండపోయెను. కన్నులలో గ్రుచ్చుకొనియున్న బాణముతో సహా గిరగిరందిరుగుచున్న పక్షినందఱుచూచిరి. మహాజనసమూహమునుండి వచ్చు శ్లాఘనధ్వనులు మిన్ను ముట్ట, బాకా, తుతారాలయొక్కయు, యితరవాద్య విశేషములయొక్కయు నాదము భూనభోంతరముల నింపివేసెను. ఈసందడిలోనే లావణ్యవతియగు గంగాకన్యక యాయున్నతాసనముదిగ్గి చెలికత్తెలతోడఁగూడివచ్చి వరసుందరకుసుమవిసరము కూర్పబడిన యనర్ఘపుష్పదామముతో జేతయొక్క కంఠమునలంకరించి, తానువరించినట్టి భర్తగా నతనిని మన్నించెను. జనసమూహముయొక్క యుత్సాహమునకు పారము లేకుండెను. ఉల్లాసధ్వనులు, నభినందనములు ముగిసి రంగస్థలము విజనమగునప్పటికి మధ్యాహ్నము దాటిపోయెను. స్వయంవరమహోత్సవమైన వెంటనే గంగాకన్యవివాహమహోత్సవము జరిగినది. ఈయుత్సవములు సమాప్తమైన పిమ్మట సేనాధిపతి తన భవనమును, శిబిరమును సరస్వతీకన్యక వివాహము నిమిత్తము తనసఖుడైన ధనుర్వేదాచార్యునకిచ్చెను.

ఈరెండు వైవాహిక కార్యములందును సంభవిల్లినట్టి యామోదప్రమోదములను గురించి వర్ణింపవలసిన యాక

వృత్తాంతముగాని, నూతనముగా జీవితరథములో ప్రవేశించినట్టి తరుణవయస్కులగు నాపురుషులచర్యనారయవలసిన యావశ్యకతగాని, నాకు లేదు. పాఠకులకు బాగుగ తెలియుటకొఱకు గాను మైత్రేయుడు క్షత్రియస్త్రీని పెండ్లియాడినందున నతని బ్రాహ్మణత్వమునకేలోటును వాటిల్లలేదనియు, బ్రాహ్మగుప్తుడు యజ్ఞదత్తుని పుత్రికను పెండ్లియాడినందున నతని వైశ్యత్వము పెఱుగక, తఱుగక నాతడెప్పటివలెనే గౌరవనీయుడగు వైశ్యుడుగ, వర్తకుడుగా నుండెననియు మాత్రము చెప్పనగును.

ఈవివాహములవలన నుత్పత్తినొందిన సంతానము బ్రాహ్మణులును, వైశ్యులునునైరి కాని మరియొకరెవ్వరో మాత్రము కాలేదు. ఆకాలపు జాతిభేదములీకాలపు జాతిభేదములవంటివి కావు.

నేనీకథ కెవరిపేరు పెట్టితినో ఆమైత్రేయినిగూర్చి కొన్నిమాటలుచెప్పి దీనిని ముగించెదను. పైన నుదాహృతములైన వేదుకలయందు మైత్రేయి కాత్యాయనీ యాజ్ఞవల్క్యులతో కలిసి హృదయపూర్వకముగా పాల్గొని సంతసించెనని వేఱుచెప్పంబనిలేదు.

ఇదివఱకే తెలిపిన విధమున చాలపెద్దవయస్సులో యాజ్ఞవల్క్యుడు వనవాసమునకేగుదమని నాలుగాశ్రమవిధులతో

